# చచ్చిపోయిన మనిషి

[డి. హెచ్. లారెన్సు రచన]

అనువాదం :

" పాప "

యువ బుక్ డిపో
ఆచారప్పన్ వీధి : : గవర్నరుపేట
మద్రాసు : : బెజవాడ

# చచ్చిపోయిన మనిషి

## [భాగం ఒకటి]

జెరూసలేం పక్కని ఓకాపుండేవాడు. అత డొక లేత కోడిపుంజుని సంపాదించుకున్నాడు; చిన్నగా వికారంగా ఉండేది. కాని వసంతం వచ్చేసరికి ధైర్యంగా రెక్కలు తొడిగేది. అత్తిచెట్లు రెమ్మలచివర లేతఆకులు తొడిగేసరికి వంపుతిరిగిన నారింజరంగు మెడతో నిగనిగలాడేది. ఆ కాపు పేదవాడు. ఓమట్టి గుడిసిలో కాపురం ఉండేవాడు. ఆగుడిసి చుట్టూరా చెత్తా చెదారంతో నిండిన ఓదొడ్డి; ఆదొడ్డికల్లా ఆస్తిపాస్తి ఓఅత్తిచెట్టు. అతడు ద్రాక్షపొలాల్లో రోజల్లా కష్టపడి పనిచేసి రోడ్డుపక్కని ఉన్న తన గుడిసికి రాత్రులు నిద్రపోడానికి వస్తోఉండేవాడు. కాని అతనికి తన పుంజుని చూస్తే గర్వం. మూసిఉన్న ఆదొడ్డిలో మూడు వికారమైన కోడిపెట్టలుండేవి. చిన్నగుడ్లు పెట్టేవి. ఉన్న నాలుగు ఈకలూ రాల్చేసుకునేవి. వంద పెట్టలపెట్టు చెత్తచేసేవి. ఓమూల గడ్డిచూరుకింద ఓ ఉలుకూ పలుకూ లేని గాడిద కూడా ఉంది. తరుచు కాపుతో పనికిపోయేది. అప్పుడప్పుడు ఇంటిదగ్గరే ఉండిపోయేదికూడాను. ఇంక ఆ కాపు భార్య ఉంది. నల్లటి కనుబొమలు, పిల్లవంటి రూపు. అంత కష్టపడేదికాదు. పక్షులికి కాస్త గింజలు గిరవటేస్తో ఉండేది, మిగిలిపోయిన కూరముక్కలు గిరవటేస్తో ఉండేది. కొడవలి తీసుకుని గాడిదకోసం కాస్త పచ్చగడ్డి కోస్తో ఉండేది. లేతపుంజు కొంత రంగురంగుగా తయారయ్యింది.

ఏదో విధి వెళాకోళం వల్ల, ఆదొడ్డిలో ఆ మూడు అతుకుల కోడిపెట్టలలోనూ, పుంజు నాజూకుగా తయారయింది. అది మెడ వంచి కీచుగా కూత వెయ్యడం నేర్చుకుంది, గోడఅవతల తను ఎరగని లోకంలో కూసే ఇతర పుంజులికి సమాధానంగా.

కాని దాని జుట్టుకి ఓ ప్రత్యేకమయిన ఎర్రటి నిప్పువంటి రంగు ఉంది. దూరాన్ని వినబడే ఇతర పుంజుల కూతలు అకస్మాత్తుగా దానిలో ఉద్రేకాన్ని పుట్టించేవి. కాపు పనిలోకి పోతూ తనపుంజునిచూసి "ఓ! ఎల్లా పాడుతుంది!"అన్నాడు.

"మన పుంజు ఇరవై పెట్టలకి ఈడు," అంది కాపుభార్య.

కాపుదొడ్లో ఉన్న తన పుంజువేపు గర్వంగా చూశాడు. ఆపుంజు—రంగురంగుల పొగరుబోతుపుంజు—అప్పుడే ఆ మూడు అతుకుల పెట్టలతోనూ ఆఖరిపరిచయం చేసేసుకుంది. దాని ఎర్రటిజుట్టు నిలబడేది. దూరాన్ని కనబడని పుంజుల ఉసికొరుపు వినబడేసరికి—ఎక్కడో ఇంకో లోకంలో మాయగా చిత్రంగా దెయ్యపు పిలుపులు—దిక్కులు మారుమోగేటట్లు నిర్లక్ష్యంగా "నేను లొంగుతానా?" అన్నట్టు తిరిగికూసేది. "ఎప్పుడో ఇది ఎగిరి పారిపోతుంది," అంది కాపుభార్య. అంచేత వాళ్లూ దాన్ని గింజలూ అవీ ఎరపెట్టి పట్టుకున్నారు. దానికున్న అన్ని ఈకలూ రెక్కలూ కాళ్లతోటే తెగ దెబ్బలాడింది. కాపు దాని తొడకి ఓ తాటిగొస కట్టాడు; తాటి రెండోకొస గాడిద ఉన్న చూరుకింద స్తంభానికి కట్టేశాడు. ఆ లేతపుంజు అసహ్యించుకుంటో గట్టిగా అడుగులు వేస్తో, ఈ మానవుల-

దగ్గరనించి దూరంగా నడిచింది. తాడు చివరకి వచ్చింది. ఒక్క ఊపు ఊపింది. కట్టేసున్న కాలిని ఒకలాగు లాగింది. ఓక్షణం ముందుకి పడిపోయి ఆ మట్టినేలమీద ఉద్రేకంతో గింజుకుంది. మూడు అతుకుల పెట్టలూ హడలిపోయాయి. తరవాత విసుగువచ్చేటంత ప్రయత్నంచేసి లేచి నిలబడి ఆలోచించుకుంది. కాపూ కాపుభార్యా విరగబడినవ్వారు. లేతపుంజు ఆనవ్వు వింది. తన కాలికి కట్టుడున్నట్టు అది తెలుసుకుంది—ఓ నిస్పృహతో, తన దురదృష్టం గుర్తించు కున్నట్టుగా. ఇంక అది గట్టిగా అడుగులు వెయ్యలేదు. రెక్కలు విప్పి రంగులు ప్రదర్శించలేదు. తన కాలితాడు హద్దుల్లోనే గంభీరంగా తిరిగింది. అయినా మంచి తిండి ఏదయినా దొరికితే గబుక్కుని మింగేస్తుంది.

ఇంకా ఒకొక్కప్పుడు బాగా మంచిముక్క నొకదాన్ని, ఆ సమయానికి తనకి అభిమానం పుట్టిన పెట్టకోసం దాస్తుంది. ఇంకా ఒకొక్కప్పుడు తనతాడు హద్దుల్లోకి యాదాలాపంగా వచ్చిన పెట్టమీదికి వణికిపోయే వేగంతో దూకి తనలో దాగిఉన్న చమత్కారం కాస్త చూపిస్తుంది. ఇంకాకూడా గోడ అవతల మాయలోకంలో కూసే కోడి పుంజుల్ని ధిక్కరిస్తో కూత వేస్తుంది. కాని అది ముక్కుతో తిండి పొడిచేటప్పుడు ఓతీరని ఆబ ఉంది; ఆ వికృతపు పెట్టల మీదికి దూకేటప్పుడు కసితోకూడిన సంతృప్తి ఉంది. అన్నిటికంటే దాని గొంతులో కంచులామోగే కంఠం పోయింది. దాని కాలు కట్టివేసి ఉంది, ఆ సంగతి అది మరచి పోను. దేహం, ఆత్మ, ప్రాణంకూడా ఆ తాడుతో కట్టుబడి

పోయాయి. అయినా అడుగుని మాత్రం దానిలో జీవం, లోతుగా పగలిపోకుండా ఉంది. ఆ తాడు మాత్రం ఎల్లా అయినా తెగిపోవాలి. అంచేత ఓ ఉదయం, ఇంకా వెలుగు రాకముందే, అది తన నిద్రలోంచి బలమయిన ఉద్రేకంతో మేలుకుని అకస్మాత్తుగా రెక్కలమీద ముందుకి దూకింది. తాడు తెగిపోయింది. అది ఓ వింత పొలికేకలా కూసింది. ఒక్క ఎగురులో గోడమీదికి లేచింది. మళ్లీ పెద్ద గింగురు మనేటంత కూత కూసింది. ఆ పెద్దకూతకి కాపుకి మెలుకవ వచ్చింది.

ఆసమయానికే సరిగా తెల్లవారగట్ల అన్నిగడియలకే ఓమనిషి తన్నికట్టివేసిన దీర్ఘనిద్రలోనించి మేలుకున్నాడు. అతని దీర్ఘనిద్రలో అంతసేపూ అతని దేహం పెద్దగా గాయ పడి ఉంది. ఇప్పుడూ పెద్దగా గాయపడే ఉంది. అతడు కళ్లు విప్పలేదు. అయినా అతనికి మేలుకున్నట్టు తెలుసును— చల్లగా కొయ్యబారినట్టుగా తెలుసును. అతనిముఖంమీద చల్లటి కట్లు ఉన్నాయి. కాళ్లూ రెండూ కలిపి కట్టిఉన్నాయి. చేతులుమాత్రం విడిగా ఉన్నాయి. కావాలంటే అతడు కదలగలడు. అతనికి తెలుసును. కాని అతనికి కోరిక లేదు. మృతిలోంచి మళ్లీ మేలుకోవాలని ఎవరికి ఉంటుంది? కదలా లని తోచేసరికి, ఓలోతు, లోతయిన వికారం అతనిలో మెదిలింది. తనలో వింతగా కొలలేకుండా మెదిలే ఆ చైత న్యానికి అప్పుడే అతడు చిరాకుపడుతున్నాడు—జ్ఞప్తిలోకి వచ్చే ఆచైతన్యానికి. అల్లా అవాలని అతడు కోరుకోలేదు. అతడు అవతలే నిలిచిపోవా లనుకున్నాడు, జ్ఞప్తికూడా

చావులా గడ్డకట్టుకుపోయేచోట. కాని అతనిదగ్గరకు ఏదో మళ్లీ తిరిగివచ్చింది—ఓతిరిగివచ్చిన ఉత్తరంలాగ. ఆతిరిగి రాకలో అతడు ఓవికారానికి వశుడై అల్లాపడుకునిఉన్నాడు.

అయినా అతనిచేతులు చటుకుని కదిలాయి. పైకి లేచాయి, చల్లగా, బాధగా, బరువుగా అయినా అవి లేచాయి. లేచి అతనిముఖంమీద గుడ్డ తొలిగించాయి. భుజాలమీద కట్లు తప్పించాయి. మళ్లీ కిందపడిపోయాయి, చల్లగా, బాధగా, బరువుగా-అంతమాత్రం కదిలినందుకే అసహ్యంతో, ఇంక కదలడానికి చెప్పరానంత అయిష్టంతో. ముఖంమీద గుడ్డతొలిగించి భుజాలకట్లు విప్పి అతడు మళ్లీ చచ్చిపోయినట్టు పడుకున్నాడు. మృతిఅనే ఓచల్లటిశూన్యం మీద విశ్రాంతిగా పడుకున్నాడు. అదే అతనికి చాలా బాగుంది. కొంచెం ఇంచుమించుగా మళ్లీ తెచ్చుకున్నాడు-అవతలనిలిచే ఆచల్లటి పరమశూన్యం. కాని ఇంక కొద్దిలో ఆశూన్యంలోకి పోయేసమయానికి, మణికట్టుదగ్గర ఏదో పోటువచ్చి అతనిచేతులు మళ్లీ లేచాయి. మోకాళ్లకట్లు ఒత్తిగించబోయాయి. అతనికాళ్లు కదిలాయి. అతనిగుండెలు మాత్రం ఇంకా చల్లగా చచ్చిపోయిఉన్నాయి. చివరకి అతనికళ్లు తెరుచుకున్నాయి. అదే చీకటి! ఆమొదటినాటి చీకటే! కాని అన్నిటినీ కదిపేసే ఆవెలుగులోంచి ఓపాలిన వెలుగు పాకిందేమో, కటికిచీకటిని బలవంతంగా బద్దలు చేస్తూ వచ్చిందేమో ఓవెలుగు! అతడు తల ఎత్తలేక పోయాడు. కళ్లు మూసుకుపోయాయి. మళ్లీ అంతా పూర్తి అయిపోయింది. తరవాత గబుక్కున లేచి కూర్చున్నాడు.

అప్పుడు పెద్దప్రపంచకం అంతా గిరగిర తిరిగింది. కళ్లు పక్కకి పడిపోయాయి. అతనిచుట్టూ రాతిగోడలు మూసుకుపోయి క్రొత్త బందికానాలాగా అనిపించాయి. అందులో వెలుగుపొదలు పాకుతున్నాయి. ఆ తిరుగుబాటు లోంచివచ్చిన పెద్ద పట్టుదలతో ముందుకి ఆనుకున్నాడు.... పలచని చేతులతో రాతిగోడమీద ఆనుకున్నాడు. ఎక్కడి నించో వచ్చింది బలం–ఆతిరుగుబాటులోంచి. ఏదో చటుకుని విరిగిపోయింది. వెలుగు ఓపెద్దకెరటంలా వచ్చిపడింది. పశుత్వంలా మీదికి ప్రవహించే ఆ వెలుగును ఎదురుకుంటూ ఆమనిషి తనమృతపేటికలో పాకులాడుతున్నాడు. అయినా ఇంకా తెల్లవారలేదు. వింతగా వాడిగా ప్రత్యూషపు ఊపిరి అతనిగుండెలకు తగిలింది. దాంతో పూర్తి తెలివి! మెల్లగా, మెల్లగా ఆరాతినూతిలోంచి ఇవతలికి పాకాడు, జాగ్రత్తతో, ఒళ్లంతా వుళ్లుపడ్డవాడిజాగ్రత్తతో. కట్లు, గుడ్డలు వాటిసుగంధం, పక్కకి పడిపోయాయి.

ఆ రాతిగోడ పక్కకి మెల్లగా ఒదిగాడు, పోయిన విస్మృతిలోకి మళ్లీ పోవడానికి. కాని గాయాలుపడ్డ తన కాళ్లు బాధగా, ఎంతోబాధగా మట్టిని ముట్టుకుంటూ అతనికి కనబడ్డాయి. అసలు తనకాళ్లు మట్టిని మళ్లీ ముట్టుకోదలుచుకోలేదు. చచ్చిపోయిన ఆపలచనికాళ్లు చూసుకున్నాడు. పెద్దబాధ దైహికమయిన పరమనిస్పృహావంటిబాధ, ఊహించడానికి వీలులేనంతగా అతనిలో నిండిపోయింది. అతడు లేచి నిలబడ్డాడు. చిల్లుపడ్డ ఓచేతిని గోరీఅంచుమీద ఆనుకున్నాడు. వెనక్కి! మళ్లీ వెనక్కి! అదంతా అయిన

తరవాత. అతని మృతపాదాలపక్కని కట్టుగుడ్డలు పడిపోయిఉన్నాయి. వంగి అవన్నీ తీశాడు. మడతపెట్టి రాతి నూతిలో పెట్టాడు. సువాసనవేసే ఓ పెద్దకప్పుగుడ్డతీసి దుప్పటిలా కప్పుకున్నాడు. వెంబగా ఆవరించుకున్న ఆపొద్దుటి వెలుగులోకి నడిచిపోయాడు. అతడు ఒంటరి. చచ్చిపోయి ఒంటరితనానికి కూడా అవతల ఉన్నాడు. చెప్పరానంత నిస్పృహావల్ల కలిగిన చిరాకులో, అల్లల్లాడేకాళ్లతో, ఆ రాతివాలు దిగాడు. అడవిలా పెరిగిన పువ్వులమొక్కల కింద ఉన్నిశాలువాలు కప్పుకుని రక్షకభటులు నిద్రపోతున్నారు. మెల్లగా, బట్టబయలుగా, పుళ్ళుపడ్డ కాళ్ళ మీద నిలబడి, కప్పుగుడ్డలోనించి కిందికిచూశాడు. జడపదార్థాలలా పోగులుపడిఉన్నాయి ఆభటుల శరీరాలు. అసహ్యంగా ఉన్నాయి, మలినావయవాలగుట్టలు. అయినా అతనికి జాలిపుట్టింది. వాళ్ళు మేలుకుంటారేమోనని రోడ్డువేపు నడిచివెళ్ళిపోయాడు. ఎక్కడికి వెళ్ళడానికీ ఏమీ లేక పోడంచేత రోడ్డువెంబడి, దూరంగా కొండమీాద కనబడే పట్టణంవదిలి వెనక్కితిరిగాడు.

అవిశి తోటల్ని దాటి నడుస్తున్నాడు. ఊదారంగుల పువ్వులు దారిపక్కని ఆ తెల్లవారగట్ల చలిలో కిందికి వేలాడుతున్నాయి. దట్టమయిన ఆకుపచ్చని కొమ్మలూ ఆకులూ దారిలోకి ఒత్తుకుని వస్తున్నాయి. లోకం ఎప్పటిలాగే ఉంది! మామూలు లోకం పచ్చదనంతో పోగుపడి ఉంది. ఎక్కడో ఓ కోయిల ఇంకా వచ్చీరాని గొంతుకతో, ఆకర్షకంగా, చక్కలిగింత పెడుతో ఎక్కడో సెలయేటి

పక్క పొదలోంచి కూస్తోంది. పగలూ రాత్రితో ఎన్నడూ చచ్చిపోని ఈ లోకం! ఈ లోకంలోంచి తను చచ్చి పోయాడు. అతడు అల్లా పుల్లుపడ్డ కాళ్ల మీద నడచి వెడుతున్నాడు. ఆ కాళ్లు ఈలోకంలోవీ కావు, ఇంకో లోకంలోవీ కావు. అతడు ఇక్కడా లేడు; అవతలా లేడు. కళ్లుండే చూడ లేకుండా మసగ్గా అల్లానడిచిపోతున్నాడు. పట్టణపుసరిహద్దులు దాటిదూరంగా ఎందుకు వెడుతున్నాడో అతనికి వింతగా ఉంది. ఓ లోతయిన నిస్పృహ యొక్క వెగటు అతన్ని ముందికి నెట్టుతోంది—అతనికి అసలే తెలియని ఓ స్థైర్యం ఏదో! అవిశితోట పొడిగోడల పక్కనించి అతడు అల్లా మత్తుగా నడిచిపోతూ ఉంటే కీచుమని ఓ కోడికూత అతని ముందు మోగింది. విద్యుత్తు తగిలినట్టు ఒక్కసారి వణికాడు. నల్లటి నారింజ రంగు పుంజు అతనికి ఎదురుగా కొమ్మమీద ఎగిరింది. అవిశి మొక్కల పై అంతస్తులో ఎగురుతోంది. వెనకాల ఉన్ని చొక్కాతొడుక్కున్న కాపు ఒకడు పరుగెత్తు తున్నాడు. పచ్చని కొమ్మలలోనించి నల్లని నారింజ కోడిపుంజు వచ్చింది. తోక ఈకలు రంగురంగుగా పెద్ద వంపుతిరిగి ఎగురుతున్నాయి.

"బాబో! ఆపండి బాబో!" అని కేక వేశాడు కా[illegible] "నా కోడి పారిపోతుందండి."

కప్పు గుడ్డలో మనిషి ఓ చిరునవ్వు నవ్వి, తన కప్పు గుడ్డ దూకబోయే ఆకోడి ముందు విప్పాడు. కోడి వెనక్కి పడిపోయింది. క్యార్ మంది. రెపరెప కొట్టుకుంది. కాపు

ముందికి దూకాడు. రెక్కలు గబగబ కొట్టుకున్నాయి. ఈకలు రెపరెపమన్నాయి. కాపు కోడిని సురక్షితంగా చంక కింద నొక్కి పట్టుకున్నాడు. దాని రెక్కలు మూత పడ్డాయి. ముఖం పిచ్చిగా ముందుకి వంగింది. తెల్లటి గుడ్డ మధ్య దానికళ్లు గుండ్రంగా తేరిచూస్తున్నాయి.

"నా పారిపోయిన కోడి," అన్నాడు కాపు, దాన్ని నిమురుతో చెమట తుడుచుకుంటో. కాపు కప్పు గుడ్డలో మనిషి వేపుచూశాడు. కాపు రూపు మారిపోయింది. చచ్చిపోయిన మనిషి తెల్లటి ముఖంలోకి తేరిచూశాడు. చచ్చిపోయిన తెల్లటిముఖం రాయిలా పేరుకుపోయింది. చావులోలాగే ఓ నల్లటిగడ్డం మొలిచింది. నల్లటిలోతుకళ్లు బాగా తెరుచుకున్నాయి—చచ్చిపోయిన కళ్లు. మైనపు నుదురుమీద ఆ కడిగిన గాయాలు! ఆ సందర్భాన్ని ఎదురుకోలేని అమాయకత్వంతో ఉద్రేకమే ఎరగని ఆ కాపు నోరు తెరుచుకు చూశాడు.

"భయపడకు," అన్నాడు కప్పుగుడ్డలో మనిషి. "నేను చచ్చిపోలేదు. నన్ను చచ్చిపోకుండానే దింపేశారు. అంచేత మళ్లీ లేచాను. అయినా నన్ను వాళ్లు పట్టుకుంటే అంతా మళ్లీ చేస్తారు......" పురాతనమయిన అసహ్యం అతని గొంతుకలో పైకి వచ్చింది. "అబ్బ! ఈ మానవులు! అధికారంచేత ఉన్న ఈ మానవులు! వీళ్ల చేతనైంది ఒకటే."

చకచక మెదిలే కాపు కళ్లలోకి అతడు చూశాడు. నిర్లక్ష్యంగా నల్లటిచూపులు చూశాడు. కాపు కంగారుపడిపోయాడు. వింత నిర్దయతోకూడిన ఆధీనమూ, మృతివంటి

నిర్లక్ష్యంతో ఆ చూపులు! కాపు బలహీనుడయి పోయాడు. తనకి ఏది అనడానికి భయంవేసిందో అదొక్కటే అన గలిగాడు. "మా యింటోదాక్కుంటారా సామీ!"

"అల్లాగే, కాని నువ్వు ఎవరితోనన్నా జెపితే ఏం జరుగుతుందో నీకే తెలుసును. మళ్లీ అంతా మొదలు."

"నేనా? నే చెప్పను, తొందగారండి."

కాపు బెదురుతో నాలుగు పక్కలా చూశాడు. ఈ పాట్లకి తనెందుకు పాలు పడ్డానా అని వింతగా విచారించాడు. చచ్చిపోయిన మనిషి అవిశితోట ఎత్తుమీదికి బాధగా ఎక్కాడు. తొందరగా ముందు నడుస్తోఉన్న కాపు వెనక అవిశిచెట్లమధ్య గోధుమ పొలంలోనించి నడిచాడు. లేత గోధుమ చచ్చిపోయిన కాళ్లకింద పట్టులా తగిలింది. దాని ప్రత్యేకజీవం మొరటుగా అతనికి తెలిసి వచ్చింది. చిన్న గుట్టల అంచులమీద పట్టులాంటి వెండి జూలుతో ఎర్రటి మొగ్గలు వేలాడుతున్నాయి. అవికూడా ఇంకో ప్రత్యేక లోకంలోవి. తన లోకంలో తను కేవలం ఒంటరి. ఇవన్నీ ఎప్పుడూ చచ్చిపోని ఓ లోకంలోవి. కాని ఆ లోకం లోంచి తను చచ్చిపోయాడు. చంపి వెయ్య బడ్డాడు. అతనికి మిగిలిన దల్లా పరమ నిస్పృహలో ఓ పె[illegible] శూన్యపు వెగటు. ఇద్దరూ మట్టిగుడిసి దగ్గరకువచ్చారు.

కాపు ఆదుర్దాగా ఆ మనిషివచ్చేదాకా గుమ్మందగ్గర ఆగాడు. "రండి!" అన్నాడు "రండి, మన నెవ్వరూ చూడలేదు."

కప్పు గుడ్డలో మనిషి ఓ మట్టిగదిలో అడుగుపెట్టాడు.

అతన్ని ఆవరించుకున్న వింత సుగంధం అతనితోకూడా గదిలో ప్రవేశించింది. కాపు తలుపు మూశాడు. లోపలి తలుపు తెరుచుకుని దొడ్డిలోకి వెళ్ళాడు. ఎత్తు గోడలమధ్య దొంగలకి దొరక్కుండా గాడిద అక్కడే కట్టివేసి ఉంది. కాపు మనస్సులో ఎంతో కళవరపడిపోతో పుంజుని తాడుతో కట్టేశాడు. మైనపు నుదురుగల మనిషి పొయ్యిపక్కని ఓ చాపమీద కూర్చున్నాడు. అలిసిపోయాడు. ఇంచు మించుగా తెలివి తప్పాడు. అయినా అవతల కాపుదంపతుల గుసగుసలు అతనికి వినబడ్డాయి. కాపు భార్య అతనిరాక ఇంటి కప్పుమీద నించి చూసింది. తరవాత వాళ్లు లోపలికి వచ్చారు. ఆమె ముఖంమీద ముసుగు వేసుకుంది. నీళ్లు అక్కడ పెట్టింది. రొట్టే, ఎండిన అత్తిపళ్లూ కర్ర పళ్లెంలో పెట్టింది.

"తినండి సామీ!" అన్నాడు కాపు. "తినండి, మన నెవరూ చూడలేదు."

కాని ఆ మనిషికి తిండిమీద వాంఛ లేదు. అయినా ఓ చిన్న రొట్టె నీళ్లలో తడిపి తిన్నాడు. ప్రాణం నిలివాలి గనక. కాని వాంఛ అతనిలో చచ్చిపోయింది. ఆకలికీ దాహానికీ కూడా వాంఛ లేకుండానే అతడు మేలుకున్నాడు. బతకాలని కూడా వాంచ లేదు. ఇదివరకు ప్రాణం ఉండేచోట పరమ నిస్పృహలో పుట్టిన వెగటూ, వికారంమాత్రం మిగిలాయి: కాని నిస్పృహాకం టేకూడా లోతుని, ఓ వాంఛ లేని స్థైర్యం ఉంది— తెలివికంటే కూడా లోతుని. కాపూ, అతని భార్యా

తలుపు దగ్గర చూస్తూ నిలబడ్డారు. పలచని మైనపు చేతుల మీాద కాళ్లమీాద పచ్చిపుళ్లు భయంగా చూశారు. నిశ్చలమయిన ఆ చచ్చిపోయిన నుదుటిమీాది చారలు చూశారు. అతని నించి, అతని దేహంనించి వ్యాపించే వింత సుగంధం వాసన చూశారు. పలచని మంచి ఖరీదయిన ఆ కప్పుగుడ్డ చూశారు. దెయ్యాలుండే ఆలోకంలోంచి తిరిగివచ్చిన ఓ మహారాజేమో! వింత పువ్వునించిలా అతని పలచని దేహంనించి ఏవో సువాసనలు వ్యాపిస్తున్నాయి. ఎంతో కష్టపడి కొంత తడిరొట్టి ఎల్లాగో మింగాడు. వాళ్ల వేపు చూశాడు. వాళ్ల చిన్నహద్దుల్లో, బతుకులో పోరలాడుతో ఏ ధైర్యమూ చమత్కారమూ లేకుండా మామూలుగానే కనబడ్డారు వాళ్లు. కాని వాళ్లంతే. మామూలు లోకంలో తప్పని సరిగా, మెల్లగా నిండుకునే భాగాలు వాళ్లు. వాళ్లలో ఔదార్యం లేదు. కాని భయంవల్ల వాళ్లలో జాలి పుడుతుంది. ఆ కొత్త మనిషికి వాళ్లమీాద జాలిపుట్టింది. ఎందుకంటే, అన్నిటికంటే, ఆదరానికి వాళ్లు కరిగిపోతారు. తిరిగి ఓ అసహ్యకరమయిన ఆదరం చూపిస్తారు.

"భయపడకండి," అన్నాడు వాళ్లతో ఆదరంగా. "కొంత కాలం నన్ను మీా ఇంట్లో ఉండనివ్వండి. అట్టే, రోజులుండను. తరవాత ఇంక మళ్లీ రాకుండా వెళ్లిపోతాను. కాని భయపడకండి. నావల్ల మీాకు ఏ అపాయమూ రాదు."

వాళ్లు వెంటనే అతని మాటలు నమ్మారు. అయినా వాళ్లకి భయం పోలేదు. వాళ్లు అన్నారు: "ఉండండి

సామీ! ఎంతకాలం ఉంటే అంతకాలం ఉండండి. శ్రమ దీర్చుకోండి.''

కాని వాళ్ళకి భయం పోలేదు. అంచేత అతడు వాళ్ళని అల్లాగే భయపడనిచ్చాడు. కాపు గాడిదను తోలుకుని వెళ్ళిపోయాడు. సూర్యుడు వెలుగ్గా పైకి లేచాడు. మళ్ళీ తలుపులు మూసిన ఆ చీకటి గదిలో గోరీలో లాగే అతనికి అనిపించింది. అంచేత కాపు భార్యతో అన్నాడు: ''నేను దొడ్డిలో పడుకుంటాను.''

ఆమె దొడ్డి శుభ్రంగా తుడిచింది. అతనికోసం ఓ చాప పరిచింది. గోడపక్కని పొద్దుటి ఎండలో అతడు పడుకున్నాడు. మూసుకున్న అత్తిచెట్టు కొసలమీద కొత్త ఆకులు చిన్న మంటల్లా పుడుతున్నాయి. మోడుపైన వసంతాకాశంలోకి వ్రుమతున్నాయి. కాని చచ్చిపోయిన మనిషి వాటిని చూడలేదు. నిశ్చలంగా ఎండలో పడుకున్నాడు. ఎండ అంత వేడిగా లేదు. అతనిలో ఏ కోరికాలేదు; కదలాలనికూడా. కాని తన పలచని కాళ్లు ఎండలోపెట్టుకు పడుకున్నాడు. అతని నల్లటిజుట్టు మెడవంపులలోకి వాలింది. పలచని రంగు మాసిన చేతులు కర్రల్లా పడిఉన్నాయి. అతడు అల్లా పడుకుని ఉండగా కోడి పెట్టలు 'క్లాక్ క్లాక్' మంటూ నేల దువ్వుతున్నాయి. పారిపోయి పట్టుబడ్డ పుంజు కాలికి కట్టుతో ఓ మూల వణుకుతోంది. కాపు పెళ్లాం భయపడింది. తొంగి చూసింది. కదలికలేని ఆ మనిషి దొడ్డిలో చచ్చిపోయాడేమోనని భయపడింది. కాని సూర్యుడు ఇంకా తీక్ష్ణంగా లేచాడు. అతడు కళ్లు తెరిచి

ఆమె వేపు చూశాడు. అప్పుడామె అతడు బతికి ఉన్నందుకు భయపడింది. కాని ఆమె మాట్లాడలేదు. అతడు కళ్లు తెరిచాడు. గాజులా నిగనిగ మెరుస్తోంది లోకం. అది ప్రాణం. దాంట్లో అతనికి పాలులేదు. అది అతనికి బయట మెరుస్తోంది. ఆ నీలాకాశం, పొడుచుకు వచ్చిన పొట్టి ఆకులతో అత్తిమోడు! గాజులా మెరుస్తోంది. కాని అందులో అతడు లేడు. అతన్ని వాంఛ మోసపుచ్చింది. అయినా అతడు ఇంకా వెలుగుతున్నాడు, పూర్తిగా ఆరిపో లేదు.

ఏదో మగతలో పగలు గడిచిపోయింది. సాయంత్రం ఇంట్లోకి వచ్చాడు. కాపుకూడా ఇంటికి తిరిగివచ్చాడు. కాని అతడు భయంచేత ఏమీ మాట్లాడలేదు. కొత్త మనిషి కూడా కొంత చిక్కుడు పులుసు తాగాడు. కొద్దిగా చెయ్యి కడుక్కుని గోడవేపు తిరిగి నిశ్శబ్దంగా పడుకున్నాడు. కాపులు కూడా నిశ్శబ్దంగానే ఉన్నారు. నిద్రపోయే అతిథి వేపు ఇద్దరూ చూశారు. నిద్ర చావుకి చాలా దగ్గర. అంచేత అతడింకా నిద్ర పోగలుగుతున్నాడు. అయినా మళ్లీ ఎండ వచ్చేసరికి మళ్లీ దొడ్డిలోకి వెళ్లి పడుకున్నాడు. ఎండ ఒక్కటే అతన్ని ఆకర్షించేది, అతన్ని కొంత కదిపేది. ఇంకా పొద్దుటి చల్లగాలి అతనికి ముక్కులనిండా పీల్చాలని ఉంది. పైన వెల్లబారిన ఆకాశం వేపు చూడాలని ఉంది. ఇంకా మూసి ఉన్న గదిలో బందీలా ఉండడం అతనికి అసహ్యంగాఉంది. అతడు దొడ్డిలోకి రాగానే ఆ చిన్నపుంజు కూసింది. నొక్కి వేసినట్లు సన్నదిగాఉంది ఆకూత. కాని టిలిపితనంకంటే బలమయిన దేదో ఆ కోడి కూతలో ఉంది.

అది జీవంయొక్క మొదటి అవసరం. ప్రాణంయొక్క సాఫల్యాన్ని గట్టిగా పైకి కూత వెయ్యవలసిన అవసరంకూడా ఉంది. చచ్చిపోయిన మనిషి నిలబడి పారిపోయి పట్టుబడ్డ ఆ పుంజుని చూశాడు. అది రెప రెప బద్ధకం తీర్చుకుంది. మునిగోళ్లమీద పైకి లేచింది. తల పైకి విసిరింది. ముక్కు విప్పి మళ్లీ ఓ కూత కూసింది, బతుకునించి చావుకి ఓ ధిక్కారంలాగ. ఆ కూతలో పొగరు మోగిపోయింది. కాలితాడు వల్ల అది అణిగిపోయినా పూర్తిగా అణిగిపోలేదు. చచ్చిపోయినమనిషి జీవితం వేపు బట్టబయలుగా చూ శా డు. ఓ పెద్ద నిశ్చయం ఎక్కడ బడితే అక్కడ ఊరికే ఉబుకుతోంది. ఒకొక్కప్పుడు పెద్ద తుపానుగా ఒకొక్కప్పుడు చిన్న కెరటంగా. ఇవి కనబడని నీలాగాధంలో తేలిన నురగ ముక్కలు—ఓ నల్లటి నారింజ కోడిపుంజు, అత్తి చెట్టు కొసల మీద ఆకుపచ్చని నిప్పు నాలుకలు. ఇవన్నీ బయటికి పొడుచుకు వస్తాయి, కోరికతోటీ, ధీమాతోటీ. ఈ వసంత జీవితాలు వాంఛ అనే కనబడని నీలాగాధంలోంచి, ఓ పెద్ద శక్తి సముద్రంలోంచి, ఇవన్నీను రగల కెరటాలలా వస్తాయి, రంగు రంగులుగా, ప్రస్ఫుటంగా, క్షణికంగా. అయినా వాటి రాకలో అజరామరాలుగా వస్తాయి. చచ్చిపోయినమనిషి, ఈ చచ్చిపోని ప్రాణులు పుట్టుకలోకి వచ్చే పెద్ద ఊపు చూశాడు, కాని బతుకుమీద వాంఛ, ఉండిపోవాలనే వాంఛ వాటిలో ధ్వనించలేదు, బతికిఉన్న ఇతర ప్రాణుల మీద బ్రహ్మాండం నిండిపోయేటంత ధిక్కారంమాత్రం చేస్తాయి. ఆ మనిషి కదలకుండా పడుకున్నాడు చచ్చి

పోయిన నల్లటిచూపులతో అనశ్వరమయిన జీవితపు నిశ్చితత్వాన్ని పరీక్షచేస్తున్నాడు. ఆ పుంజు తిరిగి అతని వేపు తళుకుమనే చూపులు చూసింది—పక్షి సహజమయిన సగం చూపులు.

చచ్చిపోయిన మనిషి నిరంతరమూ ఆ పక్షినే చూడ్డం లేదు. ఆ పక్షిరూపంలో ఉన్న చిన్న, తీక్ష్ణమయిన, జీవితపు కెరటంమీద నురగను చూస్తున్నాడు. ఆహారం మెక్కేటప్పుడు దానిముక్కు యొక్క వింత కదలిక చూస్తున్నాడు. ప్రాణంతో నిగనిగలాడే దాని చూపులు చూస్తున్నాడు. అవి జాగ్రత్తగా, సిద్ధంగా, సూక్ష్మంగా, తయారుగా అన్నిటినీ ఆకళించుకుని చూస్తున్నాయి. దాని గొంతుకలో ప్రాణం ఔనంటోంది. విజయ శంఖంలా మోగుతోంది. కాని పరిస్థితి అనే ఓ బంధానికి అది లొంగిపోయి నొక్కుపడిపోయింది. కేవలం ప్రాణమే ఆ వింత భాషలో మాట్లాడుతున్నట్టు అతనికి అనిపించింది. తన అభిమానపు పెట్ట గుడ్లుపెట్టేటప్పుడు చేసే క్రొక్కొక్ ధ్వనిని అది అనుకరించేటప్పుడు దాని కాలితాడుయొక్క చిలిపితనం అందులో ధ్వనించింది. ఆ మనిషి ఓ రొట్టిముక్క దానికి గిరవటేస్తే అది ఎంతో ప్రేమగా, ఆదరంగా ఆ పెట్టల్ని పిలిచింది. పెట్టలు ఆబగావెళ్లి ఆ రొట్టిని కాలితాడు హద్దుల అవతలికి తీసుకుపోయాయి. అప్పుడు పుంజు వాటి వెనకాలే మెల్లగా నడిచి తాడు చివరికి వచ్చి ఓకుంటు కుంటింది. తాడుకి లొంగిపోయి పోగులా పడిపోయింది. దాని జెండా పడిపోయింది. అది అవమానంతో నీడలో ఊరికే కుంగి

పోయింది. అయినా అది లేత పుంజు. దానితోక ఈకలు సున్నగా ఉన్నా ఇంకా పూర్తిగా పెరగలేదు. కాని సాయంత్రం పడేదాకా దానిలో జీవితపు కెరటం మళ్ళీ పోటుపొడవలేదు. అప్పుడు దాని అభిమానపు పెట్ట తిండి వెతుక్కుంటూ అజాగ్రత్తగా తన హద్దుల్లోకి వస్తే తన కుతుకాన్ని వెలిబుచ్చుతో దానిమీదికి దూకింది. దాని రెక్కలన్నీ వణికిపోయాయి. చచ్చిపోయినమనిషి అస్థిరంగా వణుకుతో వంగిఉన్న ఆపుంజుని చూశాడు. అయినా అతడు ఒక్క పుంజునే చూడ్డంలేదు. ఓక్షణంపాటు, జీవితసముద్రపు అల్లకల్లోలంలో, ఓచిన్న కెరటపు నురగ, ఇంకో చిన్న కెరటంమీద కమ్ముకుపోడం చూశాడు. బతికి ఉండవలిసిన విధి, చచ్చిపోయినతరవాత విధికంటే ఎక్కువ బలవంతంగా, భయంకరంగా అతనికి అనిపించింది? చావు ఓనీడమాత్రమే బతుకు తప్పనిసరి, ఉద్రేకించిన ఓ పొంగు.

కనుచీకటిపడుతోంటే కాపు గాడిదను తోలుకుని ఇంటికి తిరిగివచ్చాడు. అన్నాడు: ''సామీ! తోటలో శవంపోయిం దనుకుంటున్నారు. గోరీ కాళీగా ఉందంటున్నారు. రక్షక భటులు వెళ్ళిపోయారు—ఆపాడు రోమన్లు. ఎవరో ఆడ వాళ్ళు అక్కడ ఏడుస్తున్నారు''

చచ్చిపోయినమనిషి చచ్చిపోని మనిషి వేపుచూశాడు. ''మంచిది'' అన్నాడు. ''ఏమీ ఎవరితోటీ అనకు. మన కేమీ అపాయం రాదు''

కాపుకి మనస్సులో ఓ పెద్దబరువు తగ్గిపోయింది. అతడు, మూర్ఖంగా స్తబ్ధంగా ఉన్నాడు. కాలితాడుతో కట్టుబడిన

ఆపుంజులో ఉన్నంత కుతుకమయినా అతనిలో ఎన్నడూ మెరవదు. అతనిలో అగ్గిరగలదు. కాని చచ్చిపోయినమనిషి తనలో అనుకున్నాడు: 'అయితే ఇతన్ని పైకి ఎందుకు ఎత్తాలి? మట్టిముద్దలు పండాలంటే తిరిగి దున్నాలి. పైకి లేవనెత్తితే ప్రయోజనం లేదు. మట్టిని మట్టిలోనే ఉండనియ్యి. ఆకాశంతో దానిసంబంధం అదే చూసుకుంటుంది. దాన్ని పైకి లేవనెత్తి ఉద్ధరించాలనుకోడం నాది తప్పు. దాంతో కలగజేసుకోడం నాది తప్పు. ఈజూడియా నేలలో నాగలివల్ల జరగవలసిన నాశనం జరగనియ్యి. ఈకాపు బతుకుకూడా మట్టిముద్దలాగే ఎప్పుడో తిరగబడుతుంది. దున్నవలసిన అవసరంలేకుండా మట్టిని ఎవడు ఉద్ధరించగలడు? లోకానికి ముక్తికాదు, దుక్కికావాలి.........'

అంచేత అతను కాపువేపు జాలిగా చూశాడు. కాని చచ్చిపోయినమనిషి చచ్చిపోనిమనిషి ఆత్మతో ఇంక జోక్యం కలగజేసుకోదలుచుకోలేదు. ఇంక పుట్టుకలేకుండా చచ్చిపోలేదు ఆకాపు! అతని అంతట అతనే ఎప్పుడో మట్టిలో కలిసిపోతాడు. మట్టి మట్టిని కోరేటప్పుడు ఎవరుమాత్రం ఎందుకు అడ్డుపడాలి? ఆకాపు తనలో చచ్చి మళ్ళీ పుట్టలేదు కనక అతన్ని తనదగ్గరనుంచి వెళ్ళిపోనిచ్చాడు.

ఐనా చచ్చిపోయినమనిషి అనుకున్నాడు: 'కాపు నన్ను ఆదరించాడు.'

తెల్లవారగట్ట చచ్చిపోయినమనిషి లేచాడు. మెల్లగా పుళ్ళుపడ్డకాళ్ళమీద తోటదగ్గరకు నడిచివెళ్ళాడు. ఆతోటలోనే అతనికి మోసం జరిగింది. ఆ తోటలోనే అతనికి

సమాధి కట్టారు. పూలమొక్కలదగ్గర మళుపు తిరగడం తోటే ఆరాతినూతిదగ్గర ఓఆమె కనబడింది. నీలంపసుపు వలువ తొడుక్కుంది. గోరీ నోట్లోకి మళ్ళీ తొంగి చూసింది. కాని అది కాళీగాఉంది. ఆమెచేతులు నులుపుకుంటో ఏడిచింది. ఆమె వెనక్కి తిరిగి చూడ్డంతోటే కప్పుగుడ్డలో ఆమనిషి కనబడ్డాడు, పూలమొక్కలపక్కని. ఎవరన్నా గూఢచారి ఏమోనని భయపడి ఓకేక వేసింది. ఆమెఅంది: "ఆయన ఇక్కడ లేరు."

అందుకని అతడు ఆమెను పలకరించాడు: "మాడలీన్!"

అప్పుడు ఆమె అతన్ని గుర్తించింది. కిందతూలిపడేటంత నిర్ఘాంతపడింది.

అతడు అన్నాడు: "మాడలీన్! భయపడకు. నేను బతికే ఉన్నాను. నన్ను చాలా తొందరగా దింపేశారు. అంచేత మళ్ళీ బతికాను. తరవాత ఓచోట నాకు దాక్కోడానికి ఆశ్రయం దొరికింది."

ఆమెకు ఏమనడానికీ తోచలేదు. అతనికాళ్ళను ముద్దు పెట్టుకోడానికి ముందుకివాలింది.

"నన్ను ముట్టుకోకు మాడలీన్!" అన్నాడు అతడు. "అప్పుడే వద్దు. నా గాయాలింకా మానలేదు. మానవ స్పర్శ నాకు లేదు."

ఏంచెయ్యాలో తోచక ఆమె మళ్ళీ ఏడిచింది.

అతడు మళ్ళీ అన్నాడు: "అల్లా పక్కకి పోదాం రా. ఆ పొదల్లోకి. అక్కడ ఎవరికీకనబడకుండా మాట్లాడుకోవచ్చు"

అప్పుడు ఆమె తననీలంపసుపు వలువ చేత్తోపట్టుకుని అతని వెనకాల ఓపాదలోకి వెళ్ళింది. అతడు అన్నాడు: "నే నింకా పోలుకోలేదు మాడలీన్! ఇంకముందు ఏంచెయ్యాలి?"

"స్వామీ!" అంది ఆమె, "అబ్బ! నీకోసం మే మెంత ఏడిచాం! మాదగ్గరకు వచ్చేస్తావు కాదూ?"

అత డన్నాడు: "అయినదేదో అయిపోయింది. ఇంక నేను చావును గడిచిపోయాను. వర్షాలు కురవడం మానేసే దాకానే నది ప్రవహిస్తుంది. తరవాత ఎండిపోతుంది. నాకు ఆ బతుకు ఆఖరయిపోయింది."

"అయితే నీజీవిత సాఫల్యాన్ని వదులుకుంటావా?" అంది ఆమె.

అత డన్నాడు: "నేను తిరిగి బతకడమే నా జీవితసాఫల్యం. నా సందేశాన్ని మించి నేను బతికాను. ఇంక దాన్నిగురించి నా కేమీ తెలియదు. అదే నా సాఫల్యం. నేను ప్రపంచ జీవితంతో కలగ జేసుకున్ననాటి బతుకూ నాటిచావూ కూడా గడచి ఇంకా మనిషిగానే మిగిలాను. నేనింకా యువకుణ్ణి. నాకు జీవితంలో సగం కూడా గడవలేదు అదంతా ఆఖరయి పోయినందుకు నాకు చాలా సంతోషంగా ఉంది. అదంతా ఆఖరయి పోవాలి. కాని అది గడచిపోయినందుకు నాకు సంతోషంగానే ఉంది. నేను లోకంతో కలగ జేసుకునే రోజులు అయిపోయాయి. నాలో జగద్గురువూ, జగద్రక్షకుడూ చచ్చిపోయారు. ఇంక నా వ్యవహారాలు నేను చూసుకుంటాను. నా ప్రత్యేక జీవితంలోకి పోతాను."

ఆమె వింది. కాని ఆమెకు పూర్తిగా అర్థంకాలేదు.

ఆమెమాత్రం అసంతృప్తిపడింది. కాని "మా దగ్గరకు వస్తావుకదూ?" అని ఆమె మళ్ళీ నొక్కి అడిగింది.

అత డన్నాడు: "నే నేంజేస్తానో నాకే తెలియదు. నా గాయాలు మానితేగాని నే నేమీ చెప్పలేను. కాని నా బోధ అయిపోయింది. నా ఆచార్యత్వం పోయింది. నేను బోధించిన మోక్షంలో నేను పడిపోకుండా నాచావు నన్ను రక్షించింది. నా ప్రత్యేక జీవితపు దారినే నేను పోవాలని ఉంది. మాడలీన్! పెద్ద జీవితంలో నా భాగం నేను వెతుక్కోవాలి. నా ప్రాముఖ్యంతో నిండిపోయిన ఆరోజులు, నా జగద్గురుత్వపు రోజులు అయిపోయాయి. నే నింక నా జీవితంకోసం వేచి ఉండవచ్చును. ఎవరికీ ఏమీ బోధించ నక్కరలేదు. ఎవళ్లూ నన్నింక మోసపుచ్చలేరు. నన్ను పట్టి ఇచ్చి వెయ్యలేరు. నేను నా చేతులూ కాళ్ళ హద్దులుదాటి పెద్దగా పెరిగిపోవాలనుకున్నాను. అంచేత నన్ను నేనే మోసపుచ్చుకున్నాను. నన్ను నేనే పట్టిఇచ్చుకున్నాను. పాపం నా జూడాస్! అతని యెడల నేనో అపచారం చేశాను. నే నిప్పుడు చచ్చిపోయాను గనుక నా హద్దులు నాకు తెలిశాయి. ఇతరుల నందరినీ ఊపెయ్యాలనే కోరిక లేకుండా ఇప్పుడు నా అంతట నేను బతకగలను. నా అందుబాటు నా చేతివేళ్ళతో ఆఖరు. నా అంగ నా కాలివేళ్ళతో ఆఖరు. అయినా నేను అనేకమందిని ఒక్క కౌగిలిలో పట్టగల నేమో. నేను నిజంగా ఒక్కడినయినా ఇదివరకు కౌగిలించుకోలేక పోయాను. కాని జూడాసూ, ఇతర మతాధిపతులూ, నన్ను నా బోధలోనుంచి రక్షించారు.

ఉదయమే సముద్రస్నానం చేసినవాడిలా ఇంక నా విధి ఏదో నేను వెతుక్కోగలను.''

''ఇంతటి నించీ నువ్వింక ఒంటరిగా ఉంటావా?'' అని అడిగింది ఆమె. ''అయితే నీ సందేశం వట్టిదేనా? అంతా అసత్యమేనా?''

''కాదు'' అన్నాడు అతడు. ''నీ పూర్వ జీవితంలోని నీ విటులూ నీకు అసత్యం కారు. వాళ్లుకూడా నీకు ఎంతో ప్రియంగా ఉండేవారు. కాని నువ్వు అతిగాపోయావు. నా బోధలో నేనూ అతిగానే పోయాను. నాకున్న దానికంటే ఎక్కువదానం చేశాను. అదీ అపాయమే, అదీ గర్వమే. పైలేట్, W.F, ఇతరమతాధిపతులూ, నా మోక్షంనించి నన్ను తప్పించారు—నా అతిగా పోయిన మోక్షంనించి. ఈ జీవితంలో మళ్లీ అతిగా పోకు మూడలీ! అది ఇంకో చావు అవుతుంది, అంతే.''

ఆమె విచారంగా ఆలోచించింది. అతిగా దానం చెయ్యవలసిన అవసరం ఆమెకు ఉంది. అందుకు అవకాశం దొరక్కపోతే ఆమె భరించలేదు.

''నువ్వు మా దగ్గరకురావూ?''అంది ఆమె ఆదుర్దాగా ''నీ ఒక్కడికోసమే మళ్లీ బతికావా నువ్వు?''

ఆమె గొంతుకలో అపహాస్యం అతడు గుర్తించాడు. ఆమె అందమయిన ముఖంవేపు చూశాడు. ఇదివరకు గడిపిన ఆ జీవితంనించి విముక్తికావలసిన అత్యంత అవసరం ఆమె ముఖంలో నిండుగా ఉంది—తన తీవ్రతతో మగవాళ్ళను ఖండించిన ఆ జీవితంనించి అవసరమనే మేఘం ఆమెను

కమ్ముకుంది. మొదటి ఈవ్ యొక్క పెంకి ఆడతనంనించి ఆమెకు విముక్తి కావాలి—అనేకమంది పురుషు లీ కౌగిళ్ళల్లో ఇచ్చినదానికంటే ఎక్కువగ్రహించిన ఆడతనంనించి. ఇప్పుడు ఇంకో అపాయం ఆమె మీద విరుచుకుపడింది. ఇప్పుడు ప్రతిఫలం ఏమీ లేకుండా అంతా ఇవ్వాలని ఆతృర్దా పడుతోంది. అదికూడా ఈ వెచ్చని రక్తానికీ, నున్నని దేహానికీ క్రూరమయినది, కఠినమయినది.

''నేను చచ్చిపోయి మళ్ళీ బతకడం తిరిగి చావుని వెతుక్కోడానికికాదు,'' అన్నాడు అతడు.

ఆమె తలయెత్తి అతని వేపుచూసింది. అతని మైనపు నుదురు మీద అలసట మళ్లీ ఆవరించడం చూసింది. అతని నల్లని కళ్లలో పెద్ద నిస్పృహ, దాని అడుగున పెద్ద నిర్లక్ష్యం చూసింది. ఆమె చూపులు అతనికి చురుక్కుని తగిలాయి. తనలో అనుకున్నాడు 'వాళ్లు అనుకున్నదానికంటే భిన్నంగా తిరిగి బతికినందుకు నా అనుచరులు నన్ను బతక నివ్వరు.'

ఆమె అంది ''కాని నువ్వు మాదగ్గరకు వస్తావుకదూ? మాదగ్గరకు, నిన్నింతగా ప్రేమించే మా దగ్గరకు?''

అతడు కొంచెం నవ్వి అన్నాడు ''అల్లాగే''

తరవాత మళ్లీ అన్నాడు. ''నీ దగ్గర కొంచెం డబ్బు ఉందా? నే నౌకరికి ఇవ్వాలి.''

ఆమె దగ్గర ఆట్టేలేదు. కాని ఉన్నది కాస్తా ఆమె సంతోషంగా ఇస్తుంది. అతడు ఆమెతో అన్నాడు: ''నేను నీ ఇంటికివచ్చి అక్కడ ఉండిపోడానికి వీలు ఉంటుం దనుకుంటావా?''

పెద్ద నీలపు కళ్లు ఎత్తి ఆమె అతనివేపు చూసింది. అవి వింతగా మెరిశాయి. ''ఇప్పుడేనా?'' అంది ఆమె, విజయ చిహ్నితమయిన ఓ సంతృప్తితో.

అతనికి ఇప్పుడు విజయమనే భావమే వెగటుగా ఉంది— తన విజయం కాని, ఇతరులది కాని. అందుకని అన్నాడు: ''ఇప్పుడు కాదు తరవాత. నా గాయాలు పూర్తిగా మాని పోయిన తరవాత. నాకు మళ్లీ రక్త మాంసాల స్పర్శ రావాలి.''

అతనిలో మాటలు తడబడ్డాయి. ఆమె ఇంటికిపోయి తను ఎన్నడూ నివసించదని అతనికి తెలుసును. ఎందుకంటే ఆమె కళ్లలో విజయచిహ్నం మెరిసింది—ఇచ్చే అవకాశం దొరికిందనే ఓ తళుకు.

ఆమె తనలో తను నెమ్మదిగా పరవశంగా అనుకుంది: ''నా కున్నదంతా నీద్దేనని నీకు తెలుసును.''

అతడు అన్నాడు: ''కాదు, అది నేను కోరడంలేదు.''

తన గత జీవితం మీద ఓ పెద్ద తిరుగుబాటు అతనిలో నిండిపోయింది, నిస్పృహాలోని వెగటులా, తన పేగులో చొచ్చుకుపోయిన శూలపు పోటులా. ఆ పొదలో బలహీనంగా అతడు పాకులాడాడు. అయినా అతని కళ్లు తెరిచే ఉన్నాయి. ఆమె అతనివేపు చూసింది. అతడు జగద్గురువు కాడు. జగద్గురువు తిరిగి బతకలేదు. ఆ ఉత్సాహం, అగ్ని వంటి ఆ పవిత్రత అతనిలో ఆరిపోయాయి. ఆ యౌవనమూ పోయింది. అది చచ్చిపోయింది. ఈ మనిషి అప్పుడే నడి వయస్సు దాటిపోయాడు, నిస్పృహతో నీరసించాడు.

భయంకరమయిన నిస్పృహతో, ప్రేమ ఎన్నడూ జయించ లేని ఓ స్థైర్యంతో నిండిఉన్నాడు. ఆనాడు ఆమె ప్రేమిం చిన యువకుడు, ఆనాటి తన స్వామి కాడు ఇతడు. దైహికం కాని ప్రేమతో తన్ను కరిగించిన, ఆనవనవలాడే అగ్ని జ్వాలకాదు ఇది. తన పూర్వ జీవితంలోని ప్రియులను పోలి ఉన్నాడు ఇతడు. కాని వ్యక్తి విషయికంగా అంతకంటె పెద్ద నిర్లక్ష్యం, అంతకంటె తక్కువ లొంగుబాటు అతనిలో మూర్తీభవించాయి. ఆ దుర్గాతో, పరవశంతో ఆమె నిర్మించుకున్న మనః స్వర్గంలోనించి ఆమె పడిపోయింది. ఈ బతికిన మనిషి తన కలలన్నిటికీ ఒకటే చావు.

అతడు అన్నాడు: "నే నింకా చావులోనే ఉన్నాను. నన్ను ముట్టకు. ఈనాటినించి మూడవ రోజున ఇక్కడకు మళ్లీ వస్తాను. ఉదయమే నీకు రావాలని ఉంటే ఆనాడురా. మళ్లీ మాట్లాడుకుందాం."

ఆమె కుంగిపోయి, కలిగిపోయి వెళ్లిపోయింది. కాని ఆమె వెళ్లిపోతూ మళ్లీ తనకలలు నిర్మించుకుంది. ప్రభువు చచ్చి పోలేదు, బతికి ఉన్నాడని ఓ ఆదుర్దా పరవశం మళ్లీ తెచ్చు కుంది. అతడు మళ్లీ బతికాడు, ఆ జగద్గురువు, ఆ ఐంద్ర జాలికుడు! అతడు మళ్లీ బతికాడు—ఉత్త మనిషిలాకాదు, స్వచ్ఛంగా దేవతలా. అతన్ని ఈ దేహంతో స్పృశించ కూడదు. అతన్ని ఊరికే అల్లా స్వర్గంలోకి ఎత్తి వెయ్యాలి. అన్ని వింతలలోనే ఇది అద్భుతమయినది, భయంకర మయినది.

ఈలోగా చచ్చిపోయినమనిషి అంగాలు ఎల్లాగో పోగు జేసుకొని లేచి కాపు ఇంటికి బయలుదేరాడు. తన మాడలీన్ దగ్గరనించీ తన అనుచరుల దగ్గరనించీ దూరంగా ఆకాపుల దగ్గరకు వెళ్లడం అతనికి బాగానేఉంది. ఆ కాపులు మట్టిలా స్తబ్ధులు. అతన్ని విశ్రాంతి పొందనిస్తారు. అతని మీద ఏ బలవంతమూ పెట్టరు. కాపు భార్య ఇంటి కప్పు ఎక్కి అతనికోసం నలుపక్కలా చూస్తోంది. అతడు వెళ్లి పోయాడేమో నని ఆమె భయపడింది. అతడు ఇంట్లో ఉన్నంతసేపూ ఆమెకు ఎంతో సంతృప్తిగా ఉంది. ఆమె తొందరగా అతనికి తలుపు తెరిచింది.

ఆమె అంది: ''ఎక్కడికి వెళ్లారు ? ఎందుకువెళ్లారు ?''

''నేను ఆ తోటలో కొందరు మిత్రులను చూడ్డానికి వెళ్లాను. వాళ్లు నాకు కొంచెం డబ్బు ఇచ్చారు,'' అన్నాడు అతడు. ''అది నీకోసమే.''

అతడు తన పలచని చేతులు జాచాడు. అందులో మాడలీన్ ఇవ్వగలిగిన కొద్ది డబ్బూ ఉంది. కాపుభార్య కళ్లు జిలజిలమన్నాయి. డబ్బుకి కొదవగా ఉంది.

ఆమెఅంది. ''సామీ! ఇది నిజంగా నాదేనా ?''

''తీసుకో,'' అన్నాడు అతడు. ''ఇది రొట్టి తెస్తుంది, రొట్టి ప్రాణం ఇస్తుంది.''

అతడు దొడ్డిలోకి వెళ్లి మళ్లీ పడుకున్నాడు. తిరిగి ఒంటరిగా ఉన్నందువల్ల తెరిపిగా నీరసంగా పడుకున్నాడు. ఆ కాపులమధ్య అతడు ఒంటరిగాఉండ గలుగుతున్నాడు. అతని అనుచరులు మాత్రం అతన్ని ఒంటరిగా ఉండనివ్వరు.

దొడ్డిలో సురక్షితంగాఉన్న ఆ కోడిపుంజు అతనికి ప్రియంగాఉంది. జీవ చైతన్యం పొంగి వస్తోఉంటే చేసేదిలేక ఆ కోడి గట్టిగాకూసేది కాలి తాడువల్ల అవమానంతో మళ్లీ ఒక్కసారిగా కుంగిపోయేది. ఆవేళ గడ్డి చూరుకింద గోడిద తోక దులుపుకుంటో నిలబడిఉంది. చచ్చిపోయినమనిషి జీవితంనించి కేవలం వేరుగా తొలిగిపోయి పడుకొని ఉన్నాడు. అది జీవించిన చావుయొక్క నీరసం. కాని ఆ కాపు భార్య నీళ్లూ, సారా, తియ్యని రొట్టెలూ పట్టుకువచ్చి అతన్ని లేపింది. ఆమెను సంతోషపెట్టడానికి కొద్దిగా తిన్నాడు. పగలు వేడిగాఉంది. వడ్డించడానికి ఆమె ఎదురుగా వంగి నిలబడినప్పుడు ఆమె రొమ్ములు అతడు చూశాడు. ఆమె దుస్తుల్లో అవి అణకువగా ఊగాయి. అతడు తనని కోరాలని ఆమె కోరుతోందని అతడు గ్రహించాడు. ఆమెకూడా పిల్ల వంటి ఆడది. కురూపికాదు. ఆడ సంపర్కం అసలే లేని అతడు చేతనయితే ఆమెను కోరిఉండును. కాని ఆమెను అతడు కోరలేక పోయాడు. అయినా ఆమె మెత్తని ముడుచుకుపోయే దేహపు అణకువ అతనికి ఎంతో మృదువుగా అనిపించింది. కాని ఆమె మనస్సు, ఆమె ఆలోచనలు—వాటితో అతడు కలవలేకపోయాడు. డబ్బుచూసి ఆమె కళ్లు జిల జిల మన్నాయి. అంచేత ఇంకా గ్రహించాలని ఆశపడుతోంది. అతని చేతులలో కౌగిలి ఆమె కోరుతోంది. కాని ఆమె చిన్నఆత్మ రాయిలా బిగుసుకుపోయింది. ఆమె దేహానికి ఓ చిన్న మమకారంఉంది. తిరిగి ఇచ్చే దానంలో ఆమెకు ఎంతో గౌరవం. అంచేత ఆమెతో కొంచెం ఆద

రంగా మాట్లాడి ఊరుకున్నాడు. ఈ ఆడప్రాణి చిన్న ప్రత్యేక జీవితాన్ని, చిన్న ప్రత్యేక దేహాన్ని అతడు ముట్టుకో లేదు. ఏ ఆడుప్రాణి అయినా అంతే. ఆమెనించి రెండో ఆలోచన లేకుండా అతడు విముఖుడయి పోయాడు. చావులో నించి బతికిన తరవాత, ఈ దేహానికికూడా ఓ జీవితం, ఓ చిన్న జీవితం ఉంటుందనీ, దాని తరవాత ఉన్నది పెద్ద జీవితం అనీ, అతడు గ్రహించాడు. ఈ శరీరపు చిన్న జీవితంలో నించి తారుమారయిపోయిన తరవాత అతడు స్పర్శ లేని కన్యగా ఉండిపోయాడు. కాని కన్నెరికంకూడా ఓ ఆబ అని అతనికి ఇప్పుడు తెలిసింది. దేహంకూడా మేలుకుని, ఎప్పుడో నిష్కామంగా ఇచ్చి పుచ్చుకోడం జరుపుతుందని తెలిసింది. శరీరపు పెద్ద జీవితం తెలిసిన స్త్రీకోసం—స్త్రీలకోసం—అతడు తిరిగి జీవించినట్టుకూడా తెలిసింది. కాని చచ్చి పోయినందువల్ల అతనికి తొందర లేదు. కాలం, అనంతమయిన కాలం ఉందని అతనికి తెలుసును. ఇతరులకు ఇవ్వాలనే కోరిక, ఇతరులవద్ద గ్రహించాలనే కోరిక అతన్ని తొందర చెయ్యడంలేదు. ఎందుకంటే అతడు చచ్చిపోయాడు.

కాపు పొలాన్నించి ఇంటికి తిరిగి వచ్చి అన్నాడు. "స్వామీ! ఆ డబ్బు ఇచ్చినందుకు దండాలు. కాని మేం కావాలని అనలేదు. మాకు ఉన్నదంతా మీదే."

కాని ఎదురుగా నిలబడ్డ ఆ కాపుయొక్క చిన్న ప్రత్యేక జీవితం, ముందు ముందు ఇంకా పెద్ద మొత్తాలు సంగ్రహించాలనే ఆశతో జిత్తుగా మెరసే కళ్లూ చూస్తే చచ్చిపోయిన మనిషికి చాలా విషాదంగా ఉంది. నిజమే. అతనికి ప్రతిఫలం

ఏమీా అపేక్షించకుండానే ఆశ్రయం ఇచ్చాడు ఆకాపు. కాని అతనిలో ఆశ జిత్తులు పన్నుతోంది. అయితే మనుష్యులంతా ఇల్లాగే పుడుతున్నారు.

చీకటి పడిన తరువాత కాపు తనని లేవదీయడానికి వస్తే చచ్చిపోయిన మనిషి అన్నాడు: "నన్ను ముట్టకు. నేనింకా పరమపిత సానిధ్యంలోకి మేలుకోలేదు."

ఎండ ఇంకా ఎక్కువయి లేత కోడిపుంజుని ఇంకా ధగధగ లాడిస్తోంది. కాని కాపు ఆపుంజు కాలికి ఇంకో కొత్త తాడు కట్టివేశాడు. పుంజు బందీగానే ఉండిపోయింది. అయినా ఆ కోడిలో ఓ కేంద్రందగ్గర జీవం సూటిగా మండుతోంది. అది ప్రశ్నార్థకంగా, నిర్లక్ష్యంగా చచ్చిపోయిన మనిషి వేపు చూసింది. ఆమనిషి చిరునవ్వు నవ్వాడు. అతనికి ఆ కోడిపుంజు ఎంతో ప్రియంగా ఉంది.

దానితో అన్నాడు. "పక్షులలో నువ్వు తప్పకుండా పరమపిత సాన్నిధ్యంలోకి మేలుకున్నావు."

లేతపుంజు అతనికి సమాధానంగా కూసింది.

మూడవనాడు ఉదయమే అతడు మళ్లీ తోట దగ్గరకు బయలుదేరినప్పుడు, ఈ శరీరపు చిన్న ప్రత్యేక జీవితాన్ని గురించీ, దాని వెనక ఉన్న పెద్ద జీవితాన్ని గురించీ ఆలోచించాడు. పువ్వుల మొక్కలూ పొదలూ అల్లుకున్న ఆరాతి నూతిదగ్గర మళుపు తిరిగేసరికి ముగ్గురు స్త్రీలు కనబడ్డారు. ఒకతె మాడలీన్, రెండవ ఆమె అతడు బతికి ఉన్నప్పటి తల్లి. మూడవ ఆమె అతడు ఎరిగిన జోన్ అనే స్త్రీ. అతడు తలఎత్తి వాళ్లని చూశాడు. వాళ్లు అతన్ని చూశారు.

చూసి భయపడ్డారు. దూరాన్నే కాళ్లురాక నిలబడి పోయాడు. అతన్ని దేహంతోకూడా మళ్లీ తమ సొత్తు చేసుకోవాలని వాళ్లువచ్చారు. కాని అతడు ఏమయినాసరే తిరిగి వాళ్ల దగ్గరకుపోడు. వానకురవబోయే ఆ పొద్దుటి బూడిద మేఘాల నీడలో వాళ్ళ పాలిపోయిన ముఖాలు చూశాడు. చూసి వెనక్కు మళ్ళిపోయాడు.

కాని మాడలీన్ అతని దగ్గరకు పరుగెత్తివచ్చింది "నేను వాళ్లని తీసుకరాలేదు" అంది ఆమె. "వాళ్ళంతట వాళ్ళే వచ్చారు. చూడు, నీకోసం కొంత డబ్బు తెచ్చాను. వాళ్లతో మాట్లాడవూ ?"

కొన్ని బంగారు రూకలు అతని చేతిలోపెట్టింది. అవి తీసుకుంటో అతడు అడిగాడు "నేను ఇది తీసుకోవచ్చా ? నాక్కావాలి. వాళ్ళతో నేను మాట్లాడలేను, ఇంకా పరమపిత సాన్నిధ్యంలోకి నేను మేలుకోలేదు. నేనింక వెళ్ళిపోవాలి"

"ఆఁ? ఎక్కడికి వెళ్ళిపోతావు?" అని ఏడిచింది. ఆమె.

అతడు ఆమెను చూశాడు. ఆమె తనలోని మగతనం కోసం తహతహ పడుతున్నట్టు చూశాడు—తన యావనం లోని ఆ పవిత్రమయిన మగతనంకోసం, చిన్న జీవితపు పోరలాటల్లో ఇవ్వడమేగాని గ్రహించడం తెలియని ఆ మగతనం కోసం. "నేను నా ప్రభువు దగ్గరకూ పోవాలి," అన్నాడు.

"అదుగో మా అమ్మ. మమ్మల్ని వదలి వెళ్ళిపోతావా" అంది ఆమె వెనక్కు చూపిస్తో. ఆ పాత ఆదుర్దా ఇంకా ఆమెకు మధురంగానే ఉంది.

కాని "నేను నా ప్రభువు దగ్గరకు పోవాలి" అంటూ అతడు ఆ పొదచాటుకి తిరిగి పోయాడు. తొందరగా వెళ్ళి పోతూ తనలో అనుకున్నాడు: "నే నిప్పుడు ఎవరివాణ్ణీ కాను. నాకు స్పర్శ లేదు. నా బోధ, నా సందేశం నా కింక లేవు. చూడు, నా జీవితమే నేను చేసుకోలేక పోతున్నాను. ఇంక ఎవరిని రక్షిస్తాను? నేను ఒంటరిగా ఉండడం నేర్చు కుంటాను." అంచేత కాపు ఇంటికి తిరిగి వెళ్ళిపోయాడు. కోడిపుంజు కాలి తాడుతో కట్టి ఉన్న ఆ దొడ్డిలోకి వెళ్ళి పోయాడు. ఒంటిగా ఉండడమే మంచిది గనుక అతడు ఎవ రినీ కోరడు. మనుష్యుల సాన్నిధ్యంలో అతనికి భరించలేని ఒంటరితనం. ఆ ఎండా ఆ వసంతంలోని ఓ ఔషధసారం అతని గాయాలు మాన్పుతున్నాయి. అతని పేగులలో నిస్సహాలా తెరుచుకున్న పెద్ద గాయంకూడా పూడిపోతోంది. జనంకోసం అతనికిగల తహతహా, వాళ్ళవల్ల తను ముక్తి పొందాలనే తీవ్రత, అదికూడా తగ్గిపోతోంది. తనకీ ఇతరు లకీ మధ్య వచ్చే స్పర్శ ఇంకమీద బలవంతం లేకుండా, హద్దులు మీరకుండా రావాలి. అతడు తనలో అనుకు న్నాడు: 'వాళ్లని బతకమని నేను బలవంతంచేశాను. అందుకే వాళ్లు నన్ను బలవంతంగా చంపేశారు. బలవంతం ఎప్పుడూ అంతే. ముందుకి సాగినంత మేరా వెనక్కి విసిరి వేస్తుంది ఆ తిరుగుబాటు. ఇప్పుడు నేను ఒంటరిగానే ఉండి పోవాలి.'

అందుకని అతడు ఇంక తోటలోకి వెళ్ళలేదు. వెల్లగిల పడుకుని అల్లా ఎండని చూసేవాడు. కనుచీకటివేళ అవిశ

పొలాల్లో నడిచేవాడు. ఎండకాసిన ఒక్కొక్క రోజుకీ జానెడు జానెడు ఎదిగే గోధుమచేలలో తిరిగేవాడు. ఎప్పుడూ తనలో తను అనుకునేవాడు: 'నా సందేశం ఏదో పూర్తిచేసి, దాన్ని మించి ఇంకా బతికి ఉండడం ఎంత అద్భుతమయిన సంగతి! ఇంక నేను ఒంటరిగా ఉంటాను. ఏ ప్రాణి కా ప్రాణిని వదలి వేస్తాను. దానికి ఇష్టమయితే అత్తిచెట్టు ఆకులు రాల్చు కుంటుంది, ధనికులు ఇంకా ధనం సంపాదించుకుంటారు. నా దారి నా ఒక్కడిదే.'

అప్పుడు ఆకుపచ్చని సూదులు అత్తిచెట్టుకొసలమీద ఆకుల్లా విప్పుకొన్నాయి. నిర్మలంగా గాజులా ఆకుపచ్చని చూపులు ఆకాశంలోకి చూస్తోంది అత్తిచెట్టు. ఆ లేతపుంజు ఇంకా నిగనిగ మెరిసింది. ఎండలోకాగి ఇంకా నిగనిగ లాడింది. కాని ఎప్పుడూ కాలికికట్టు తప్పలేదు. సాయంత్రం అప్పుడు, సూర్యుడు ఎర్రబారిన బంగారపు ఆకాశంలోనించి అంతకంతకు గొప్పగా అస్తమిస్తున్నాడు. చచ్చిపోయిన మనిషి అదంతా చూశాడు. అతడు అనుకున్నాడు: 'సాయం కాలం అప్పుడు ఈలోకం చటుకుని ఓ చీమలా కుడుతుంది. చీమల్లా కుట్టే కొన్ని మాటల్ని పట్టుకుని మనిషి బాధపడు తాడు. అతన్ని స్మశానందాకా ఆ మాటలు వెంబడిస్తాయి. కాని స్మశానందాటి అతన్ని వెంబడించలేవు. నేను మాటలు చీమల్లా కుట్టేచోట గడచిపోయాను. నాకు అంతా నిర్మ లంగా ఉంది. నేను ఎవరికీ ఏమీ చెప్పవలసిందిలేదు. నా చర్మంలోపల నేను, ఒంటరిగా ఉన్నాను. అదే నా సర్వం, నా సామ్రాజ్యం.' అందుకని తన గాయాలు అతడు నెమ్మ

దిగా మాన్పుకున్నాడు. అలజడి లేకుండా బతకగలిగిన అమరత్వం అతడు అనుభవిస్తున్నాడు. మనం ఆదుర్దా అనే బంధం అతడు గోరీలోనే వదల్చుకున్నాడు. నిత్యమూ ముందుకు పొడుచుకువచ్చే తన అలజడిపడే తత్వాన్నికూడా అతడు గోరీలోనే వదుల్చుకున్నాడు. ఇప్పుడు అతని ఆత్మ గాయాలుమాని నిర్మలంగా అతని చర్మంలోపల నిండుగా ఉంది. స్వచ్ఛమయిన సన్యాసంలో అతడు తనలో చిరునవ్వు నవ్వుకున్నాడు. అదొక అమరత్వం.

అప్పుడు తనలో అనుకున్నాడు: 'నే నీలోకం అంతా తిరుగుతాను. కాని ఏమీ మాట్లాడను. ఈ తొందరపడే ఇంద్రజాలిక లోకం మధ్య ఒంటరిగా ఉండడం ఎంత అద్భుతమయిన సంగతి! నే నిదివరకు ఈ లోకాన్ని చూడ లేదు. నేనుకూడా అందులోనే ఉండిన కంగారువల్ల గుడ్డిగా అయిపోయాను. నే నింక ఈ ఐంద్రజాలికలోకపు అలజడిలో తిరుగుతోఉంటాను. ఈ వస్తువులు వాటికదలికలో అవే మునిగిపోయి నన్ను ఒంటరిగా వదలివేస్తాయి'.

అల్లా తనలో తను నిర్ధారణచేసుకున్నాడు. వైద్యవృత్తి అవలంబించాలని నిశ్చయించుకున్నాడు. తనకి దయపుట్టిన ఏమనిషికయినా వైద్యసహాయం చెయ్యగలశక్తి అతనిలో ఉంది. తనచుట్టూ గడ్డమూ ఆవృత్తికి అనుగుణంగా కత్తి రించుకున్నాడు. తనలో తను నవ్వుకున్నాడు. తగిన జోళ్లూ తగిన దుస్తులూ సంపాదించుకున్నాడు. తలమీది గాయాలు కప్పిపుచ్చేటట్టు సరిగా పాగా చుట్టుకున్నాడు. అప్పుడు కాపు అడిగాడు: "సామీ! మాదగ్గరనించి వెళ్ళిపోతారా?"

"అవును, ఇంక మానవలోకంలోకి పోవలిసినసమయం వచ్చింది." కాపుకు కొంత డబ్బు ఇచ్చి అన్నాడు: "ఆ పారి పోయి పట్టుబడ్డ పుంజుని నాకు ఇచ్చివెయ్యి. అది నాతో కూడా ఉంటుంది."

అప్పుడు ఆడబ్బుకి కాపు కోడిపుంజుని చచ్చిపోయిన మనిషికి ఇచ్చివేశాడు. ఐంద్రజాలిక లోకంమధ్య అతడు తన ఒంటరితనాన్ని పూర్తిచేసుకోడానికి బయలుదేరిపోయాడు. ఇదివరకు అతడు అందులో ఎక్కువగా కలిసిపోయాడు. తరవాత చచ్చిపోయాడు. ఇప్పుడు మళ్ళీ అందులో బతికినా కూడా ఒంటరిగా ఉండపోవాలి. కాని ఇప్పుడయినా అతడు ఒంటరిగా పోవడంలేదు. అతనిచంకలో కోడిపుంజు ఉంది. దాని తోక వెనకాల రెపరెపలాడుతోంది. దానిమెడ ఉద్రేకంగా ముందుకివంగింది. అదికూడా మొదటిసారి ఈ ఐంద్రజాలికలోకం మధ్యకి తెగించిపోతోంది—ఇతరకోళ్ళకదలికతో నిండిన ఆలోకంలోకి.

కాపుభార్య రెండుకన్నీళ్ళు కార్చింది. కాని కాపు గనక తలుపుచాటుకిపోయి డబ్బులు లెక్కచూసుకుంది. ఆరూకలలోనించి ఏదో వెలుగు వస్తోఉన్నట్టు ఆమెకు అనిపించింది. చచ్చిపోయినమనిషి అల్లాగే తిరిగాడు. పగలు ఎండవల్ల వెచ్చగా ఉంది. నడుస్తో ఇటూ అటూ చూశాడు. పట్టణం వేపుకి ఓబళ్ళప్రవాహం పోతోంది. దారిపక్కకి తప్పుకుని దాన్ని పోనిచ్చాడు. తనలో అనుకున్నాడు: 'ఈ ఐంద్రజాలికలోకం వింతగా ఉంది—నిర్మలంగానూ, మలినంగానూ కూడా. నేనూ అంతే. కాని నేను వేరే ఉన్నాను. జీవం

అనేకరకాలుగా బుడగలు తేలుతుంది. అన్నీ ఒక్కలాగే బుడగలు తేరాలని నే నెందుకు అనుకున్నాను? నే నెందుకు వాళ్ళకి బోధించాను? బోధ ఎప్పుడూ మనిషిని మట్టికింద మర్దనా చేస్తుంది. లోపలఉన్న జల ఏదయినా ఆగిపోవచ్చు, కాని ఓకీర్తన, ఓప్రార్థన అల్లాకాదు. వాళ్ళకి అంతగా బోధించినందుకే వాళ్ళు నన్ను చంపివేశా రనుకుంటాను. అయినా వాళ్ళు చివరకి నన్ను పూర్తిగా చంపివెయ్యలేక పోయారు. నేను నా ఒంటరితనంలో తిరిగి బతికాను. ఈ లోకం నాది, అని నేను అనుకోనుగనకే దీన్ని నేను వశపరుచుకోగలుగుతాను. అన్నిజీవుల పొంగులోనూ నేను మాత్రం విడిగాఉంటాను. ముఖ్యంగా, శాశ్వతంగా నేను ఒంటరిగానే ఉండిపోతాను. కాని ఈ పక్షిని ఎక్కడో ఈ జీవితపుపొంగులోకి వదలివెయ్యాలి. దానిజీవితపు కెరటం అది స్వారిచేసితీరాలి. ప్రాణంతో ఎంత వేడిగా ఉంది ఈ కోడి! త్వరలో ఎక్కడో దీన్ని పెట్టలమధ్య వదలివేస్తాను. ఏమో, ఒకనాడు నేనూ ఓస్త్రీని కలుసుకుంటానేమో!— నామేలుకున్న దేహాన్ని ఆకర్షించికూడా, నాఒంటరితనాన్ని నాకు మిగల్చగలిగిన స్త్రీని. నావాంఛాశరీరం చచ్చిపోయింది. నేను ఎక్కడాకూడా స్పర్శలో లేను. అయినా ఏమో, చివరకి అంతాకూడా జీవమే. పెట్టల కుతుకాన్ని ఆకర్షించినా ఈపుంజు స్వచ్ఛమయిన ఒంటరితనంతో నిగనిగలాడుతోంది. ఆ ఎదురుగా కొండమీాద కనబడుతోఉన్న పల్లెకి తొందరగా పోతాను. నే నప్పుడే అలిసి నీరసంగా ఉన్నాను. అన్నిటిమీాదా కళ్లుమూసి విశ్రమించాలని ఉంది.'

నడవడం పూర్తిజేసేకోరికతో అతడు తొందరగా నడిచాడు. నెమ్మదిగా ఏదో మాట్లాడుకుంటో ముందునడుస్తో ఉన్న ఇద్దరిని కలుసుకున్నాడు. వాళ్ళని ఆనమాలుపట్టాడు. తనపూర్వజీవితంలో వాళ్లు పరిచితులు—తన ఆచార్యత్వపు జీవితంలో. అందుకని వాళ్ళని పలకరించాడు. కాని కను చీకటిలో తనని వ్యక్తపరుచుకోలేదు. వాళ్ళతో అన్నాడు: "ఎవణ్ణిగురించి అంటున్నారు? నే నేరాజు నన్నందుకు ఎవణ్ణి చంపివేస్తా!"

వాళ్లు అనుమానిస్తో అన్నారు: "నీకెందుకుఅతనిసంగతి?"

"నేను అతన్ని ఎరుగుదును. అతన్నిగురించి చాలా ఆలోచించాను" అన్నాడు.

అందుకు వాళ్ళు అన్నారు: "అతడు మేలుకున్నాడు"

"నిజమే? అయితే అతడు ఏడీ? ఎల్లా ఉన్నాడు?"

"మాకు తెలియదు. అది ఎవరికీ తెలియజెప్పలేదు. కాని అతడు మేలుకున్నాడు. కొద్దిరోజుల్లో పరమపిత సాన్నిధ్యంలోకి పోతాడు."

"నిజమే! అయితే పరమపిత ఎక్కడ?"

"నీకు తెలియదూ? నువ్వు జెంటైలువా? పరమపిత స్వర్గంలోఉన్నాడు, మేఘాలకీ, ఆకాశానికీ పయిన."

"నిజమే? అయితే ఎల్లా వెడతాడు?"

"ఎలిజా యోగిలా ఓవెలుగులా ఆకాశంలోకిపోతాడు"

"ఆకాశంలోకి? అయితే అతడు రక్తమాంసాలతో మేలుకోలేదూ?"

"శరీరంతోటే మేలుకున్నాడు"

"అయితే బొందెను ఆకారంలోకి తీసుకుపోతాడా"

"స్వర్గంలో పరమపిత అతన్ని తీసుకుపోతాడు."

చచ్చి పోయిన మనిషి ఇంక ఏమీ అనలేదు, అనేది ఏమీ లేక. ఊరికే మాటలవల్ల మాటలు పుడతాయి పురుగుల్లాగ. కాని వాళ్లు అడిగారు. "నువ్వా కోడి పుంజుని ఎత్తుకున్నా వెందుకు?"

"నేను వైద్యుణ్ణి" అన్నాడు అతడు.

"పక్షి నీతి అయినది. నువ్వు విశ్వాసివి కావా?"

"అవును! ఈ పక్షిలో నిండుగా ప్రాణం, నీతి ఉన్నాయని నా విశ్వాసం."

వాళ్లు తరవాత మౌనంగా నడుచిపోయారు. తన సమాధానాలకి వాళ్లు అసంతృప్తి పడ్డట్టు అతడు గ్రహించాడు. తనలో నవ్వుకున్నాడు. ఈ లోకంలో అపాయకరమయిన వింత సంకుచితమయిన విశ్వాంగల మనిషి—తన పక్క వాణ్ణి ఒంటరిగా ఉండనివ్వని మనిషి. పల్లెటూరి పొలిమేర లోకి వచ్చిన తరవాత ఆ బరువయిన కనుచీకటిలో కొంచెం నిలబడి తన పాత గొంతుకలో అన్నాడు: "నన్ను ఎరగరూ మీరు?"

వాళ్లు భయపడి ఓ కేక వేశారు : "సామీ!"

"అవును," అని మెల్లగా నవ్వాడు. తరవాత తొందరగా అతడు ఓ పక్క సందులోకి మళ్లిపోయాడు. వాళ్లకిఇంకా తెలివిరాకముందే గోడనీడలో మాయమయిపోయాడు.

---

'విశ్వాసి' అనేమాట Belver అనేమాటకు పర్యాయపదంగా ఉపయోగించబడింది. క్రీస్తుబోధలో విశ్వాసంగలవాడు విశ్వాసి అని భావం.

ఒక సత్రం దగ్గరకు వచ్చాడు. అక్కడ దొడ్డిలో గాడి దలు కట్టివేసి ఉన్నాయి. "వేపుడు మాసం ముక్కలు కావా"లని అడిగాడు. వాళ్లు తయారుచేసి ఇచ్చారు. దొడ్డిలో పాకకింద పడుకున్నాడు. తెల్లవారగట్ట ఓ పెద్ద కోడి కూత అతన్ని మేలుకొలిపింది. చెవులు గింగురు మనే టట్టుగా అతని కోడి మళ్లీ కూసింది. చాలా పెట్టల్ని వెన కాల వేసుకుని సత్రపు కోడిపుంజు దెబ్బలాటకోసం నడచి వస్తోంది. చచ్చిపోయిన మనిషి పుంజు ముందుకి దూకింది. పుంజులు రెండూ దెబ్బలాడుకుంటున్నాయి. తన పుంజుని విడదీయడానికి సత్రపు మనిషి పరుగెత్తబోయాడు. కాని చచ్చిపోయిన మనిషి అతనితో అన్నాడు: "నాకోడి గనక నెగ్గితే దాన్ని నీకే ఇచ్చివేస్తాను. అది ఓడిపోతే కోసుకు తిందు గాని." పుంజులు ఘోరంగా దెబ్బలాడాయి. సత్రపు పుంజుని చచ్చిపోయిన మనిషి పుంజు చంపివేసింది.

చచ్చిపోయినమనిషి పుంజుతో అన్నాడు: "నువ్వయినా నీ సామ్రాజ్యం సంపాదించుకున్నావు. నీ మగతనానికి పెట్టల్ని సంపాదించుకున్నావు. నీ ఒంటరితనం నీ పెట్టల ఆకర్షణచేత ఇంకా నిగనిగలాడుతుంది."

తన పుంజుని అక్కడే వదలివేసి అతడు ఐంద్రజాలిక లోకంలోకి ఇంకా ముందుకి సాగిపోయాడు. ఆలోకం అనేక బంధాలతో ఆకర్షణలతో అల్లిబిల్లిగా అల్లుకు పోయింది. తనలో తను ఓతుదిప్రశ్న వేసుకున్నాడు.

'ఈ అనంతమైన అల్లకల్లోలాన్ని దేన్నించి రక్షించడం? దేనికోసం రక్షించడం?' అంచేత అతడు తనదారిని ఒంటరిగా

అల్లాగే వెళ్ళిపోయాడు. కాని లోకపుదారి నమ్మడానికి వీలు లేకుండా ఉంది. వింత అనుబంధాలు, కామాలు, సంఘట నలు, బలవంతం, అన్నిచోట్లా అవే. అందులో నిద్రమత్తు వంటి ఆ బలవంతం! భయం—చావువల్ల భయం, మని షిని పిచ్చివాణ్ణి చేస్తోంది. అంచేత అతడు ఎప్పుడూ అల్లా తిరుగుతూనే ఉండాలి. ఎక్కడయినా ఆగితే ఇరుగుపొరుగు వాళ్లు మళ్లీ అతనిచుట్టూ తమ భయాన్నీ బలవంతాన్నీ సాలిగూడులా అల్లి పారవేస్తారు. నేను అనే తత్వం, పిచ్చి ఎక్కిస్తే అన్ని వస్తువులూ అతన్ని బలవంతంలోకి తొయ్యా లని చూస్తాయి. అందుకని అతడు దేన్నీ స్పృశించలేడు. అతని ఏకాంతం భగ్నమవుతుంది. పట్టణాలు, సంఘాలు, వీటిపిచ్చి, మనిషిమీద—అందరు మనుష్యుల మీద—ఓ బలవంతాన్ని పెడతాయి. ఎవరి శూన్యత వాళ్లు గ్రహించీ కూడా, స్వార్థంచేత భయపడి స్త్రీలూ పురుషులూ వెర్రిగా తిరుగుతున్నారు. అతడు తన సందేశాన్ని గురించి మళ్లీ ఆలోచించుకున్నాడు. ప్రేమవల్ల బలవంతం అందరి మీదా అతడు ఎల్లాపెట్టడానికి ప్రయత్నించాడో అంతా ఆలోచించు కున్నాడు. వెనుకటి పైత్యపు వెగటు అతనికి మళ్లీవచ్చింది. బహు సూక్ష్మంగానైనా బలవంతం ఆపాదించని అనుబంధమే లేదు. ఈ లోకంలో చివరకి అతనిమీద చావుకూడా బలవంతంగా విరుచుకుపడింది. వెనకటి గాయపుపైత్యం మళ్లీ పచ్చిగా పగిలింది. లోకంకేసి అతడు అసహ్యంతో చూశాడు. దాని నీచానుబంధాలకు భయపడ్డాడు.

---

# చచ్చిపోయిన మనిషి

## రెండవ భాగము

లిబేనాన్ కొండల కనబడని మంచుల మీదనించి గాలి బలంగా చల్లగా సముద్రం వేపు వీస్తోంది. ఆగుడి దక్షిణంగా పడమరగా ఈజిప్టు వేపు చూస్తోంది. శీతకాలపు సూర్యుడు అద్భుతంగా ఎర్రగా వంపుతిరిగి సముద్రంలోకి అస్తమిస్తో, గుడిమీద రంగులు పూసిన కర్ర స్తంభంమీద ఒక్కసారి తనప్రభ నింపేస్తాడు. చెట్లమరుగున సముద్రం మాటుపడి పోయింది. కాని ఆ ఘోషమాత్రం పైన చెట్ల ఝుంయి నాదంలో కలిసి వినబడుతుంది. మధ్యాహ్నం తిరిగిన కొద్దీ గాలి పసుపు రంగు పూసుకుంటోంది. ఐసిస్ దేవతను కొలిచే ఆమె తన పసుపు వలువలో అక్కడ నిలబడి చూస్తోంది. సముద్రం ఇవతల కిందకు లోతుగావాలిన లోయల్లో అవిశి చెట్లు గాలికి తెల్లటి వెండిపువ్వులు తొడిగి నీటి నురగల్లా అడుతున్నాయి. ఆ దేవత తప్ప ఆమెకు తోడు ఎవరూ లేరు. శీతకాలపు మధ్యాహ్న కాంతి కంటికిఆనని సముద్రానికి అటువేపున తీర పర్వతాలమీద నిండుగా, నిటారుగా గొప్పగా నిలిచింది. ఆకు పచ్చని ఆ మధ్యధరా సముద్రతీరాన్ని చెట్ల చాటులోనించి ఆమె ఎండకు ఎదురుగా నడిచివెళ్ళింది. చెట్ల చాలుమధ్య ఉంది గుడి. ఇరుపక్కలా సముద్రపు పాయల మధ్య ఓ భూమి నాలుకమీద దట్టపు చెట్ల చాలులో ఉంది. ఆమె కొద్దిదూరమే నడిచింది. ఆ చాలు చిట్ట చివర

ఎండ మోడులనడుమ ఆమె నిలబడింది. కిందరాళ్లమీద సముద్రం హోరుగా మొత్తి పిలుస్తోంది. ఎదురుగా తెరిపిగా వెలుగైన సూర్యుడు శీతకాలపు సుఖాన్ని అనుభవిస్తున్నాడు. నల్లటి నీలసముద్రం భూమినించి వెనక్కి తగ్గిపోతోంది. తెల్లటి కిరీటాలు కెరటాలమీద ఆడుతున్నాయి. లోయలో అవిశిచెట్లమీద తెల్ల రంగు పూసినట్టుగానే గాలి సముద్రంమీద వింతగా నల్లటి నీడలు పరిచింది. ఎక్కడా ఒక్క పడవయినా కనపడడం లేదు. ఓ చిన్న కట్టడం పక్కని ఆ సముద్రపు పాయలో మూడు పడవలు కట్టివేసి ఉన్నాయి. ఒడ్డు పొడుగునా ఓ ఎత్తయిన ప్రహరీ ఉంది. లోపల ఎత్తయిన సమతలంమీద ఓ తోట అంతకంతకు ఎత్తుగా లేచి కనబడుతోంది. తోటలో ఇంకో ప్రహరీలోపల ఓ చిన్నకట్టడం సముద్రంలాగే తెల్లంగా ఒంటరిగా నిలిచి ఉంది. ఇంకా పైని—బాగా పైని—అవిశిచెట్ల అవతల, మళ్లీ పైన్ చెట్లు మొదలుపెట్టిన చోట, సముద్రంలోకి పాకేలోయ అన్నిటికంటే ఎత్తుని తీరపువారే రోడ్డు కనబడుతోంది. ఆ మార్గశిర మాసపు మధ్యాహ్నం ఆ రోడ్డుమీద ఎండ ఓ సామ్రాజ్యంలా వ్యాపించుకుంది. సముద్రంమీది నిరాఘాటపు ఆ ఒంటరితనం, స్వచ్ఛమయిన తళుకు, ఆ ద్రవ్యమూ, ఆ రూపమూ, అవన్నీ ఎండలో భాగాలు. కిందకీ పైకీ ఊగే నల్లనీటి అంచుని ఒక రాతిపలకమీద ఇద్దరు బానిసలు అర్ధనగ్నంగా కూర్చుని రాత్రి వంటకోసం చంపిన పావురాలు కడుగుతున్నారు. వింత తీక్ష్ణతతో వాళ్లు, ఓ నిండు ప్రాణంగల పావురా నీలకంఠాన్ని పొడిచి రక్తపు

చుక్కలు తహతహలాడే సముద్రంలోకి వదులుతున్నారు. ఏదో యజ్ఞమో ఏదో ఆరాధనో వాళ్లు చేస్తున్నట్టు ఉన్నారు.

పూజారిణి చలికాలపు గులాబిలా పసుపుగా తెల్లగా ఎత్తైన పైన్ చెట్లమధ్య నిలబడి చూసింది. ఆమె వెనక భూమినాలుకలో గుడి మరుగుపడిపోయి ఉంది. ఓ నల్ల తెల్లటిపావురా, నీలాఖాతంలోపుట్టిన ఏదో తెల్ల దెయ్యంలా చ్రున ఎగిరింది. గాలిలో పల్టీలు కొట్టింది, ఎగిరింది, పైకి పోయింది, పైన్ చెట్లకి ఇంకా పైన అణువులా ఆకాశంలోకి పారిపోయింది. అది తప్పించుకుని పారిపోయింది.

పూజారిణి మగబానిస కేకవింది. అతడు తోటలో పనిచేసే బానిస కుర్రవాడు. పదిహేడు సంవత్సరాలుంటాయి. పావురా పారిపోయిన వేపు కోపంగా చేతులెత్తాడు. కోపంగా, నగ్నంగా, యౌవనంగా తన చేతులు ఎత్తాడు. ఆ కోపం తోటే వెనక్కి తిరిగి బానిస పిల్లను రెండు చేతులా పట్టుకున్నాడు. పావురా రక్తం చిమ్మిన తన పిడికిలితో ఆమెను కొట్టాడు. ఆమె లొంగిపోయి వణుకుతో తనముఖం నేల మీద దాచుకుంది. యజమానురాలు వాళ్లిద్దరినీ చూస్తోంది. ఆమె అల్లా చూస్తో తనవలే చూస్తోఉన్న ఇంకో కొత్త మనిషినికూడా చూసింది. నల్లటి గడ్డం, వదులునూలు వలువ, వెడల్పయిన టోపీ. అతడు ఆగుడి ఉన్న భూమి నాలుక ముఖం దగ్గర ఓ రాతిపలకమీద నిలబడి చూస్తున్నాడు. అతని బూడిదరంగు వలువ ఎగరడంబట్టి అతన్ని ఆమె చూసింది. శీతకాలపు గులాబిలా, పసుపుగా, తెల్లగా ఎగిరే ఆమె పట్టు వలువ గాలికి రెప రెప లాడితే అతడు ఆమెను

చూశాడు. ఇద్దరూ ఆ బానిసల నిద్దరినీ చూస్తున్నారు. కుర్రవాడు చటుకుని ఆ పిల్లను కొట్టడం మానివేశాడు. ఆమెమీద మెల్లగా వంగి ముట్టుకుని మాట్లాడించడానికి ప్రయత్నించాడు. కాని ఆమె నిశ్చేతనంగా ఆ రాతినేల మీద బోర్లగిలపడుకుంది. చేతులతో చుట్టి ఆమెను పైకి ఎత్తాడు. ఆమె చచ్చిన శవంలా చటుకుని నేలమీదికి జారిపోయింది. కాని మృతశరీరంలా కాక చాలా తొందరగా జారిపోయింది. కుర్రవాడు అదుర్దాగా ఆమెను నడుందగ్గర పట్టుకుని దగ్గరగా హత్తుకున్నాడు. ఆమె వెల్లగిల నిశ్చేతనంగా పడుకుని భుజాలతో ఇంకా గిజ గిజ లాడులోంది. ఓ తొందరతో ఇంకేమీ తెలియని ఓ ఉద్రేకంతో అతడు తన చేతిని ఆమె తొడలమధ్య జొనిపి ఎడంచేశాడు. ఓ క్షణం అతడు కుర్రతనపు మొదటికామంవల్ల భయంతో, గుడ్డిగా ఆమెను ఆవరించుకున్నాడు. తొందరగా పిచ్చిగా అతని దేహం ఆమెమీద్ద నగ్నంగా ఓ ముహూర్తంపాటు వణికింది. తరవాత శవంలా నిశ్చలంగా ఉండిపోయింది

అతడు భయంగా చుట్టూ చూస్తో లేచాడు. నెమ్మదిగా తన మొలకు చింపిగుడ్డ చుట్టుకున్నాడు. ఆ కొత్త మనిషిని చూశాడు. తరవాత తన యజమానురాలు ఆ ఐసిస్ సతిని చూశాడు. ఆమెనుచూసి అతని దేహం లోపలికి ముడుచుకుపోయింది. ఓ కుంటు నడకతో నెమ్మదిగా అతడు గోడలో తలుపు దగ్గరకు పారిపోయాడు. ఆ పిల్ల లేచి అతడు వెళ్లిపోడం చూసింది. కొత్త మనిషిని చూసింది. పూజారిణిని చూసింది. ఏమీ ఎరగనట్టు దొంగనడక నడుస్తో రాతిమీద

ఉన్న కత్తిచంపిన పావురాలదగ్గరకు పోయింది. ఆ పావురాల చిన్న ఈకలు లాగి పారవేస్తోంది. ఈకలు గాలిలో దుమ్ములా ఎగిరిపోతున్నాయి.

పూజారిణి అసహ్యంతో వెనక్కి తిరిగిపోయింది. బానిసలు! వాళ్ల సంగతి ఉద్యోగి చూసుకుంటాడు. ఇవన్నీ ఆమెకు అవసరం లేదు. పైగా చెట్లమధ్యనించి, ఆమె మళ్లీ గుడిదగ్గరకు నడిచి వెళ్లింది. భూమి నాలుక మధ్య తెరిపి అయిన సమతలంలో ఉంది గుడి. కర్రతో కట్టినది. చిన్నగుడి. తెలుపు, నీలం, ఊదారంగులు నిండుగా పూసి ఉన్నాయి. ముందు నాలుగు కర్ర స్తంబాలు తామర కాడలలా నిలిచి పైన ఓ పద్మంలా విప్పుకున్న మండపాన్ని నిలబెడుతున్నాయి. ప్రతి స్తంభానికీపయిన ఓ పద్మం విప్పుకుంది. స్తంభాలకిముందు ఓ అరుగూ, దానికి రెండు కర్ర చీడీలు ఉన్నాయి. స్తంభాలకి మధ్య తెరుచుకున్న ఆవరణ ఉంది. ఓ పొట్టి బలిరాయి అవరణలో ఒక మూల ఉంది. దాని మధ్య గుంటలో నిప్పులు రగులుతున్నాయి. అంచుని రక్తపు మరకలున్నాయి. ఆమె తనగుడిని బాగాఎరుగును. ఆమె స్వయంగా కట్టించింది. ఏడు సంవత్సరాలుగా ఆ గుడిలో అర్చన చేస్తోంది. నల్ల ఆకుపచ్చ చెట్ల చాలు మధ్య కాళీ ప్రదేశంలో ఆగుడి తెల్ల ఊదా పువ్వులాఉంది. సాయంకాలపు నీడలు అప్పుడే గుడి స్తంభాల అడుగులమీాద నీరులా ప్రవహిస్తున్నాయి. లోపల ఆవరణలో నూనె దీపం సువాసనగా వెలుగుతోంది. ఆమె ఆ చీకటి ఆవరణలో నించి నడచి మూసిఉన్న గుడి తలుపు మళ్లీ తోసింది.

దేవత ముందు ఉన్న కంచు నిప్పు పాత్రలో సాంబ్రాణి పొడి జల్లింది. తన దేవత సాన్నిధ్యంలో మళ్లీ కూర్చుంది. ఆ కనుచీకటిలో కూర్చొని మళ్లీ తన ఊహలలోకి వెళ్లి పోయింది. తన దేవతను గురించిన స్వప్నాలలోకి వెళ్లి పోయింది. దేవత ఐసిస్, హోరస్ తల్లి ఐసిస్ కాదు. ఆమె వియోగిని అయిన ఐసిస్. నిరంతర ప్రతీక్షలో ఉన్న ఐసిస్. రంగులు పూసిన పాలరాతి దేవతా విగ్రహం అది. ఆమె ముఖం పైకెత్తి ముందుకి అడుగులు వేస్తోంది. వియోగం, అన్వేషణలోని ఆదుర్దాతో ఒక తొడ ముందుకి వేసింది. ఆమె వలువ పలచని రెప రెపలోనించి ఆ తొడ నున్నగా కనబడుతోంది. చచ్చిపోయిన ఓసిరిస్ దేహ ఖండాలకోసం ఆమె వెతుకుతోంది—చచ్చిపోయి ముక్కలై పోయిన దేహ ఖండాలు, చచ్చిపోయి లోకం అంతటా విర జిమ్మబడిన దేహ ఖండాలు. అతని చేతులు, కాళ్లు, అతని గుండె, తల, కడుపు అన్నీ ఆమె వెతుక్కోవాలి. అన్నీ ఒకటిగా సద్దాలి. అ సద్దిన దేహాన్ని తన చేతుల్లో వెచ్చగా కౌగిలించుకుని ప్రాణం పొయ్యాలి. ఆ దేహం వెచ్చబడాలి. ఆమెను తిరిగి కౌగిలించుకోవాలి. ఆమె గర్భాన్ని ఆధానం చెయ్యాలి. ఆమె వింత అన్వేషణ, ఆదుర్దాలో, ఉత్సాహంలో అబ్దాలు గడిచిపోతున్నాయి. పలచగా ఆమె నడుముకు చుట్టిన వలువలోనించి మొగ్గవంగి కడుపు కనబడుతోంది. దానిమధ్య లోతయిననాభి నిత్య ప్రతీక్షలో ఏదో కావాలని అడుగుతో ఉన్నట్టు అనిపిస్తోంది. గడిచి పోతూ ఉన్న ఈ అబ్దాలలో ఆమె క్రమంగా అతని తల, చెయ్యి,

కాలు మొదలయిన అంగాలు ఒక టొకటిగా కూర్చు కుంటోంది. కాని అతని ఆఖరు తత్వాన్ని మాత్రం ఆమె ఇంకా కనుక్కో లేదు. అతని అస్థిత్వాన్ని దృఢపరిచే మూల రహస్యం ఆమెకు ఇంకా దొరక లేదు. ఆమె ఐసిస్. దివ్య పద్మంలోని ఐసిస్. ఆమె గర్భం తామర మొగ్గలో ఒదిగి పోయి ఉంది. మగ ఓసిరిస్ డొక్క లలో ప్రసరించే అంత స్సూర్య కిరణాల తాకుడుకోసం వేచి ఉంది. అది ఆమె ఏడు సంవత్సరాలుగా తదేకదీక్షతో కొలిచిన అద్భుత రహస్యం. అప్పు డామెకు ఇరవై సంవత్సరాలు. ఇప్పుడు ఇరవై ఏడు. ఆమె చిన్నతనంలో లోకంలోనే నివసించింది, రోములో యూఫసిస్‌లో, ఈజిప్టులో. ఆమెతండ్రి ఆంటొనీ సేనాధిపతులలో ఒకడు, స్నేహితులలో ఒకడు. సీజరు హత్యచేయబడిన ఆ లజ్జాకరమయిన రోజుల్లో ఆమెతండ్రి ఆంటొనీతో పాటు నిలిచి యుద్ధం చేశాడు. తరవాత అతనికి రోములో ఆశ్రయంపోయింది. ఆసియాలోకి వచ్చి లిబేనాఁ పర్వతాలలో చచ్చిపోయాడు. ఆక్టేవియస్ యొక్క ఆదరణ దొరకే అవకాశం లేకపోడంచేత, ఆమె తల్లి ఆమెతోకూడా లిబేనాఁ కింద ఉన్న తన చిన్న ఆశ్రయంలోకి వచ్చి వేసింది. అప్పు డామె పందొమ్మిది సంవత్సరాలకన్య. ఆమె చిన్నతనంలో సీజర్‌ని ఎరుగును. కాని అతని డేగవంటి తీవ్ర తహ తహ నించి ఆమె దూరంగా తొలిగిపోయింది. అప్పుడప్పుడు ఆంటొనీ ఆమె పక్కని కూర్చుని దేవతలూ, వాళ్ల వేదాంతాలూ చర్చిస్తో ఉండే వాడు. అతని మగతేనం ప్రభలా వెలిగేది. అతని అవ

యవాలు దీర్ఘంగా గొప్పగా కమ్ముకుని ఉండేవి. అతనికి చిన్నతనంనించీ దేవతలంటే ప్రీతి. కాని అతడు తనఉన్నతిలో వాళ్లనిమరచి పోయేవాడు, తరుచు పరిహాసించేవాడు.

అతడు ఆమెతో అన్నాడు: "వీనస్‌కి నేను నీ బదులు రెండుగువ్వలు బలి ఇచ్చాను. అంత మధురమయిన దేవతకి నువ్వెప్పుడూ ఆరాధన చెయ్యవేం? ఆమెకు కోపం వస్తుంది జాగ్రత్త. నిజంచెప్పు నీ లోపల పువ్వు అంత చల్లగా ఎందుకుంది? ఓ చూపూ ఓ కిరణం ఎప్పుడూ లోపలికి తగలదూ? సూర్యుడు ఎప్పుడయినా ఓ యువతి వేపు చనువుగా వాలితే ఆమె తన దేహాన్ని అతని కిరణాలకి తెరిచి ఇవ్వాలి తెలుసునా?"

ఆంటోనీ పెద్దకళ్లు నవ్వుతో మెరిశాయి. ఆ మెరుపులో ఆమె మునిగిపోయింది. అతని మగ శరీరం హృద్యంగా నిగనిగలాడ్డం ఆమె చూసింది. అతని కుతుకం ఆమె అంగాల మీద వర్షపు జల్లులా కురిసింది. కాని అతడు అన్నది నిజమే. ఆమె గర్భకుసుమం చల్లగా ఉండిపోయింది— ఇంచుమించుగా మంచులాగ. అతనిలో సూర్యకాంతి ఎంత ప్రసరించినా, ఆమె మంచు కప్పిన మొగ్గలాగే ఉండిపోయింది. ఆమెను అతిగా ప్రేమించే ఆమె తండ్రి మీద గౌరవంకొద్దీ ఆంటోనీ ఇంక ఆమె వేపుకిపోలేదు. ఎప్పుడూ అల్లాగే గడిచిపోయింది. ఆమె అనేక మంది మగవాళ్లను చూసింది. పడుచువాళ్లనీ ముసలివాళ్లనీ కూడా. మొత్తం మీద ఆమెకు ముసలి వాళ్లంటేనే ఇష్టం. వాళ్లు ఆమెతో మామూలుగా మాట్లాడేవారు. తమ మగతనపు సూర్య

కాంతికి మొగ్గలా విచ్చుకోమని కోరేవారు కారు. ఓసారి ఆమె ఓ జ్ఞానినడిగింది, "స్త్రీలంతా మగవాళ్లకి అర్పణ అయిపోవాలా ?"

ముసలివాడు నెమ్మదిగా చెప్పాడు: "అపురూపమయిన స్త్రీ తనలో తిరిగి అవతరించిన మగవాని కోసం వేచి ఉంటుంది. పద్మం సూర్యుని అంత వేడికీ విచ్చుకోదు. తన తల లోతుగా వంచి కదలకుండా ఉంటుంది. ఎప్పుడో ఏ రాత్రివేళో చచ్చిపోయి ఏ వెలుగులేని అదృశ్యసూర్యుడో తిరిగి పుడతాడు. అదృశ్యమయిన ఏ ఊదారంగులోనో పుడతాడు. తన ఊదా కిరణాలు రాత్రిలో నింపుతాడు. ఓ బుజ్జగింపులా ఓ స్పర్శలా ఆ కిరణాలు పద్మాన్ని తాకుతాయి. అప్పుడు పద్మం తల ఎత్తుతుంది. ఇంక ఏ పువ్వూ ఎరగనంత విశాలంగా వికసిస్తుంది. సూదులవంటి తన వాంఛా కిరణాలను సూర్యుడికి ఎదురు పంపుతుంది. ఇంక ఏ పువ్వూ ఎరగని తన బంగారు కుహరాలు ఆ కనబడని ఊదా కిరణాలు చీల్చుకు ప్రవేశించడానికి అర్పిస్తుంది. ఆ సూర్యుడు చచ్చి బతకడంచేత మామూలుసూర్యుడులా వెలగడు పగటిపూట ఆడంబరంగా వెలిగే ఆంటొనీ వంటి బంగారు సూర్యులకు గాని, కఠిన శక్తితో గడ్డగట్టిన సీజరువంటి శీతకాలపు సూర్యులకు గాని ఆ పద్మంఎప్పుడూ కదలదు. అవి ఆపద్మాన్ని చించి పారవేస్తాయి. నేను చెపుతున్నాను, చచ్చి బతికిన సూర్యుడి కోసం వేచిఉండు."

అంచేత ఆమె అల్లాగే వేచిఉంది. ఈ రోమక్ ఇంద్రజాలంలో మగవాళ్లంతా సైనికులో రాజకీయ వేత్తలో

అయిపోతారు. ధీమా పౌరుషంతో పైకి అద్భుతంగా ఉం టారు. కాని లోపల ఓ లోటు, ఓ లోభం ప్రతివాడిలోనూ ఉంటుంది. రోమ్, ఈజిప్టు రెండు దేశాలూ ఆమెను తాక కుండా వదలివేశాయి. ఆమె లోలోపల మాత్రం ఆమె స్త్రీయే. పైతళుకుచూసి ఆమె తన్ను తాను అర్పించుకోదు. కొన్ని సావకాశాల కోసం పెళ్లిచేసుకోదు. ఆమె తన పద్మం కదిలేదాకా వేచిఉంటుంది. తరవాత ఈజిప్టులో ఆమెకు ఐసిస్ దొరికింది. ఆమెలో తన జీవిత రహస్యాన్ని ఆమె గుర్తించింది. సిడార్ తీరానికి ఐసిస్‌ని ఆమె తెచ్చు కుంది. ఆమె ప్రతీక్షా రహస్యంలో ఆమెకాలం గడుపు తోంది. ఆమె తల్లికి వ్యవహారాలలో అభిరుచి ఎక్కువ. అంచేత తల్లి ఆ చిన్న స్థానాన్నీ, బానిసలనీ స్వేచ్ఛగా పాలిస్తోంది. ఆమె క్రమంగా తన స్వప్నాలలోనించి మేలు కుని ఐసిస్ ఆఖరి పూజచేసింది. దీపంలో నూనెపోసి గుడి తలుపు తాళం వేసింది. బయట లోకంలో అప్పుడే సూర్యుడు అస్తమిస్తున్నాడు. కనుచీకటి చలిచలిగా ఆ చెట్లచాలులో ఝుంయి మంటోంది. గాలి తగ్గిపోతో ఉన్నా చెట్లు ఇంకా ఝుంయి మంటున్నాయి.

ఓ నల్ల పెద్ద టోపీ గాలికి ఎగరవేస్తో ఓ కొత్తమనిషి గుడి మెట్లదగ్గర అవతరించాడు. నల్లటి ముఖం. నల్లటి గడ్డం సన్నగా కిందికి పొడుచుకుని ఉంది. "అమ్మా! ఇక్కడ కాస్త ఆశ్రయం దొరుకుతుందా?" అని ఆమెను అడిగాడు.

ఆమె ఓ తెల్ల ఊదా స్తంభం పక్కని పసుపు వలువలో నిలబడి ఉంది. ఆమె ముఖంశోలగా పాలిపోయి ఉంది.

ఆమెగుబురుజుట్టు బంగారు తీగవలలో కట్టబడిఉంది. ఆ ద్రిమ్మరివేపు నిర్లక్ష్యంగా చూసింది. ఇందాకా బానిసలను చూసినప్పటి అతడే ఇతడు. "రాజబాట వదలి ఇల్లా ఎందుకు వచ్చావు?" అని ఆమె అడిగింది.

"ఓ తెలి పువ్వులా ఇక్కడ ఈగుడి నాకు కనబడింది. ఈ సముద్రతీరాన్ని ఈ చెట్లమధ్య కొంచెం విశ్రమిస్తాను. ఈ దేవి నాకు అనుజ్ఞ ఇస్తుందా?"

"ఈ దేవి ఐసిస్, ప్రతీకలో ఐసిస్" ఆమె అతని మొదటి ప్రశ్నకు జవాబుచెప్పింది.

"దేవి గొప్పది," అని ఆత డన్నాడు.

ఆమె అపనమ్మకంతో అతన్ని చూసింది. ఆమె వేపు అతడు ఎత్తిన నల్లని చూపులలో దూరంగా ఓచిరునవ్వు ఉంది. అతని ముఖం బాధవల్ల గుంట పడిపోయింది. ద్రిమ్మరి ఆమె అనుమానాన్ని గ్రహించి నవ్వుకున్నాడు.

"ఈ మెట్లమీద కూర్చుని ఉండు," అంది ఆమె." ఓ బానిస వచ్చి నీకు ఆశ్రయం చూపిస్తాడు. ఈజిప్టు సతి దయామయురాలు."

గూనిగా లేచిన భూమినాలుకలో రాతిదారి వెంట తన బంగారు చడావులు టకటక లాడిస్తో ఆమె వెళ్ళిపోయింది. ఆమె దంతపు పాదాలు సుందరంగా ఉన్నాయి. తెల్లని లంగా, పసుపుపచ్చని ఉన్నిపైటకండువా, ఆమె గుబురు తలలో అంతులేని స్వప్నాలు. తన స్వప్నాలలో మునిగి పోయిన ఆడుది ఆమె. కొంచెం వెగటుగా అతడు చిరునవ్వు నవ్వుకున్నాడు. కనుచీకటి చలిలో దుప్పటీ వెచ్చగా కప్పు

కున్నాడు. కొంతసేపటికి బూడిదరంగు దుస్తులు వేసుకున్న ఓ బానిస వచ్చాడు.

"మా దేవి ఆశ్రయం కోరినవాడవు నువ్వేనా ?"

"అవును !"

"అయి తేరా"

ఓ ద్రిమ్మరికి సేవచెయ్యవలసిన అయిష్టంతో కుర్ర బానిస చెట్లలోనుండి దారితీశాడు. రాతి వాలులో చీకటి గుహ అక్కడ ఒకటి ఉంది. పైకి చెట్లనీడలో చుట్టూ నిటాగ్గా పొదలు పెరిగిఉన్నాయి. ఓ తట్టులో రెల్లుగడ్డిఉంది. ప్రదేశం చీకటిగాఉంది. కాని గాలిచప్పుడయినా అక్కడికి రాదు. మెల్లగా కొద్దిగా మేకల వాసన వస్తోంది.

"ఇక్కడ పడుకో," అన్నాడు బానిస. "ఈ పక్కకి మాత్రం మేకలు మేతకిరావు. అదుగో అక్కడ తాగడానికి నీరు."

ఓ రాతి దొరువు వేపు అతడు చూపించాడు. ఓ నాచు మొక్క కొత్తజూలు అందులో తడిగా వేళ్లాడుతోంది. తన దాతృత్వం అయిష్టంగా చూపించి బానిస వెళ్ళిపోయాడు.

చచ్చిపోయిన మనిషి భూమి నాలుక అంచుమీదికి మళ్ళీ ఎక్కాడు. అక్కడ కెరటాలు విరుగుతున్నాయి. తొందరగా చీకటి పడిపోతోంది. చుక్కలు ఆకాశం నిండా పుడుతున్నాయి. రాత్రి పడిన కొద్దీ గాలి తగ్గిపోతోంది. భూభాగం వేపు లోతులోయమీది ఏటవాలు అంతకంతకు లేచి ఆకాశపు అంచువరకూ చీకటిగాఉంది. కట్టడం వేపుని మాత్రం అప్పుడప్పుడు ఓ దీపం మినుకుమంటోంది. చచ్చిపోయిన

మనిషి మళ్ళీ తన ఆశ్రయం దగ్గరకు చేరుకున్నాడు. తన తోలు సంచీలో రొట్టె తీసుకున్నాడు. రాతి దొరువులో నీటి జలలో ముంచికొద్దిగాతిన్నాడు. తిని మూతి తుడుచుకున్నాడు. నిర్మలంగా గాలితో నిండిన ఆకాశంలో మెరిసే నక్షత్రాల వేపు ఇంకోసారి చూశాడు. రెల్లుగడ్డి పక్కగా పరిచాడు. టోపీ జోళ్లూ పక్కన దాచాడు. తన తోలుసంచీ చెంప కింద తలగడగా పెట్టుకున్నాడు. అలిసిన మీదట తొందరగా నిద్రపోయాడు. కాని ఓ రాత్రివేళ చలివేసి అతనికి మెల కువ వచ్చింది. అతని నీరసంలో చలి అలసటగా సూదిలా పొడిచింది. బయట చుక్కలు నిగనిగ మెరుస్తున్నాయి. గాలి ఇంకా వస్తోంది. లేచికూర్చుని, ఓ మగతలో తనలో తను ముడుచుకున్నాడు. తెల్లవారే సమయానికి అతనికి మళ్ళీ నిద్ర పట్టింది. తెల్లవారే టప్పటి నీడలో తీరం ఇంకా చలిచలిగా ఉంది. సూర్యుడు అప్పుడే కొండలవెనుక లేచాడు. కట్టడం దగ్గరనించి ఆమె మళ్ళీ తన దేవి దగ్గరకు తిరిగి వచ్చింది. సముద్రం నిర్మలంగా పాలిన నీలంగా ఉంది. గాలి చివరికి ఆగిపోయింది. సముద్రం నవనవ లాడుతోంది. అయినా కెరటాలు ఇంకా రాళ్ళమీద తెల్లగా విరుగు తున్నాయి. అవతల చిన్న ఒడ్డున ఉన్న ఆలిచిప్పల పరుపుని చీలుస్తున్నాయి. తన స్వప్నాలలోకి ఆమె మెల్లగా నడచి వచ్చింది. కాని ఆమెకు చటుకుని ఓ అంతరాయం వచ్చింది. భూమినాలుక మెడదగ్గర దాటి గుడి ఎత్తుకి ఎక్కబోతూ ఉంటే ఓ బానిస వంగి నమస్కరించాడు. అతని అణకువలో పొగరు ఉంది.

"ఏం?" అంది ఆమె చికాకుగా.

"అమ్మా! ఆ మనిషి పారిపోయిన అపరాధి."

ఆ చెడ్డకబురు చెప్పినందుకు బానిస తనలో గొప్పగా సంతృప్తి పడ్డాడు. "ఏమి చూసి అనుకున్నావు?"

"అమ్మగారు అతన్ని చూస్తారా? అతని చేతులూ కాళ్లూ?"

"నడు."

బానిస ఓ గుట్టమీద నించి దారి తీశాడు. గుహ దగ్గర అతడు పక్కకి తొలిగి నిలబడ్డాడు. ఆమె ఆ సన్నని చీలిక లోంచి గుహదగ్గరకు వెళ్ళింది. ఆమె గుండెలు కొంచెం కొట్టుకున్నాయి. అన్నిటికంటే తన గుడియొక్క పవిత్రత ఆమె ముఖ్యంగా కాపాడుకోవాలి.

ద్రిమ్మరి నిద్రపోతున్నాడు. చెంపకింద తోలు సంచీ, దుప్పటి దగ్గరగా కప్పుకున్నాడు. అతని పాదాలు ఒకదాన్ని ఒకటి వెచ్చచేసుకోడానికి దగ్గరగా వంపు తిరిగి ఉన్నాయి. అతని చేతులు నిద్రలో వదులుగా ముడుచుకుని ఉన్నాయి. అతని పలచని పాలిన కాళ్ళమీద మామూలుగా జోళ్ళలో మరుగుపడి పోయేచోట ఆమె చీలికలు చూసింది. తెరిచి వున్న అరచేతిలోనూ చూసింది. మగవాళ్ళంటే ఆమెకు కుతూహలం లేదు. ముఖ్యంగా సామాన్యపు మగవాళ్లంటే! అయినా ఆమె ఆ నిద్రపోతోవున్న ముఖం వేపు చూసింది. అది అలిసి, గుంటగా, కొంచెం వికృతంగా ఉంది. కాని ఆమె నిజమయిన పూజారిణి అవడంచేత అందులో ఇంకో రకం అందాన్ని, జీవం యొక్క లోతయిన నిశ్చలతనీ గ్రహించింది. కదలికలేని గుంటచెక్కిళ్లో, నల్లటి కనుబొమలలో ఓ

గాంభీర్యం ఉంది. రోమన్ అలవాటుకి భిన్నంగా అతనిజుట్టు నల్లగా పొడుగ్గా పెరిగి కణతలదగ్గర కొంచెం నెరిసింది. అతని సూదివంటి గడ్డంలోకూడా నెరిసిన వెంట్రుకలు అక్కడక్కడ ఉన్నాయి. కాని అవి దురదృష్టంవల్లో, చిరకష్టాలవల్లో అయిఉంటుంది. ఎందుకంటే అతనివయస్సు యౌవనాన్ని దాటిఉండదు. అతని బూడిదచర్మంలో యౌవన సహజమయిన వెండితళుకు ఇంకా ఉంది. సున్నితమయిన అతని వికృతముఖంలో అనేక బాధలు గడ్డకట్టిన ఓసౌందర్యం సూక్ష్మజీవితంయొక్క నిశితమయిన వింతశాంతి కనబడ్డాయి. ఓవాడి మంటనాలుక చురుక్కున తగిలినట్టు ఆమె అమగ దృశ్యం చూసి చలించింది. కాని ఆమెజీవితంలో అదే మొదటిసారి. పురుషులు ఆమెలో అనేకఉద్రేకాలను పురికొల్పారు. కాని ఎప్పుడూ సజీవమయిన మంటనాలుకతో ముట్టుకోలేదు. ఆమె బానిస వేచిఉన్న రాతికొసదగ్గరకు తిరిగి వెళ్ళిపోయింది.

“తెలుసునా?” అంది ఆమె. “అతడు అపరాధి కాడు. మనరాజ్యంలో అతడు స్వతంత్రుడు. అతన్ని నిద్రపోనియ్యి. అతడు లేచిన తరవాత నాదగ్గరకు తీసుకురా. నేను మాట్లాడతానని అతనితో చెప్పు.”

బానిసలంతా ఆమెకు వెగటు పుట్టిస్తారు. అందుకని ఆమె నిశ్చలంగా చెప్పింది. వాళ్ళు చిన్నజీవితంలో చుట్టుకుపోయారు. వాళ్ళ చిన్నవాంఛలూ వాళ్ళ చిన్న తెలివీ అసహ్యంగా ఉంటాయి. అంచేత తనస్వప్నాలు తనచుట్టూ కప్పుకుని ఆమె వెళ్ళిపోయింది. ఓబానిసపిల్ల శీతకాలపు

గులాబులూ మల్లెలూ పూజకోసం తెచ్చి ఇచ్చింది. కాని ఈవేళ ఆమె పూజలోకూడా చెదిరిపోయింది.

సూర్యుడు కొండమీద ఎత్తుగా లేచి ఆభూమి నాలుకలో పైన్ చెట్లమీదా, ఆ ఊదాగుడిమీదా తళతళ కొత్తగా వెలుగుతున్నాడు. చచ్చిపోయినమనిషి మేలుకున్నాడు. తన జోళ్ళు తొడుక్కున్నాడు. తనటోపీ పెట్టుకున్నాడు. తోలు సంచీ దుప్పటికింద చంకలో దాచుకున్నాడు. సూర్యోదయంలో మెరిసే నీలం, కొత్తబంగారం చూడ్డానికి బయలు దేరాడు. కొండలమీద సూర్యకాంతిలో మెరిసే శీతకాలపు వెలిపసుపుగులాబులు చూశాడు. ఓదుర్విధిలా తనకోసం వేచిఉన్న బానిసను చూశాడు.

''సామీ!'' అన్నాడు బానిస. ''ఐసిస్ గుడిలో మా దేవి మీతో మాట్లాడుతుంది.''

''సరే మంచిది'' అన్నాడు ద్రిమ్మరి.

అతడు మెల్లగా చుట్టూచూస్తూ ఓక్షణం ఆగాడు. పాలిన నీలంగా విచ్చినపువ్వులాఉన్న ఆసముద్రం వేపు ఓక్షణం చూశాడు. కొండలమీద తెల్లని చీరచెరగులు గాలికి కదులుతున్నాయి. సముద్రందగ్గరనుంచి ఎత్తుగా లేచిన లోయ అవిశిచెట్లతో మబ్బు రంగుగా ఉంది. ఆకుపచ్చని గోధుమచేలు అక్కడక్కడ అనుతున్నాయి. ఆచిన్నప్రాసాదం తెల్లగా ఒంటరిగా ఉంది. మార్గశిరమాసపు ప్రొద్దుటి ఎండలో అంతా స్వచ్ఛంగా నిర్మలంగా ఉంది. గుడిమీద ఒకమూల ఎండపడుతోంది. అనంతమయిన ఓర్పుతో అతడు మెట్లమీద లేచి కూర్చున్నాడు. అతడు ప్రాణంలోకి తిరిగి

వచ్చాడు. కాని ఇదివరకు చిన్నజీవితంలో తనని వదిలి వెళ్ళిపోయిన ప్రాణంలోకి కాదు. చచ్చి బతికిన అతడు ఇంకోజీవితంలో ఉన్నాడు—ఇంకోజీవితంలో, వైజ్ఞానికమైన ఓ వెలుగులో. ఈ చిన్న వెలుగులో అతడు ఏకాకిగా విడిపోయి ఉన్నాడు. మామూలుప్రజలతో అతనికి స్పర్శ లేదు. జ్ఞానులను సామాన్యులనుంచి వేరుపరిచే మాంసపు ఆశ సూత్రం అతనికి పూర్తిగా అబ్బలేదు. అయినా అతని ఒంటరితనం పరిపూర్ణమయినదే. ఈ గుడిదగ్గరమాత్రం అతనికి శాంతి దొరికింది. అది గాఢమయిన దేవత్వం మధ్యశాంతి. దానిఅడుగున బానిసత్వపు అశాంతి.

ఆస్త్రీ గర్భ గుడిలోనించి అర వెలుగుగా ఉన్న లోపలి ద్వారం దగ్గరకువచ్చి నిలబడింది. ఆమె అతని నల్లటి మూర్తి చూసింది. ఆమూర్తి ఘోరమయిన నిశ్చలతతో అక్కడ కూర్చుని ఉంది, ఆ ఓర్పు ఏదో పెద్ద అపాయంలా ఆమెకు అనిపించింది. గుడిమంటపం దాటి ఆమె ముందుకి వచ్చింది. ఆమె సవ్వడి గ్రహించి అతడు లేచినిలబడ్డాడు. అతన్ని ఆమె గ్రీకు భాషలో పలకరించింది. కాని అతడు,

"దేవీ! నాకు వచ్చిన గ్రీకు చాలాతక్కువ" అన్నాడు. "నేను సిరియక్ గ్రామ్యం కొంచెం మాట్లాడగలను."

"ఎక్కడనించి వస్తున్నావు? ఎక్కడకు పోతున్నావు?" ఆమె పూజారిణి సహజమయిన తొందరనటిస్తో అడిగింది.

"తూర్పున డెమస్కస్‌కి ఇంకా అవతలనించి. నేను ఇంకా ఇల్లా పడమరికి ఈ రోడ్డు ఎక్కడికి తీసుకుపోతే అక్కడికి పోతాను," అని అతడు మెల్లగా సమాధానం చెప్పాడు.

చటుకుని ఓ ఆదుర్దాతో, ఓ సిగ్గుతో ఆమె అతని వేపు చూసింది. ఇంకా చటుకుని అడిగింది: "అపరాధిలా ఆ గుర్తులు నీమీద ఎందుకున్నాయి ?"

"ఐసిస్ నా నిద్రలో నన్ను రహస్యంగా పరీక్ష చేసిందా ?" అని వెలవెలబారే అలసటతో అడిగాడు.

"బానిస నాకు చెప్పాడు......నీ కాళ్లూ—నీ చేతులూ ......" అంది ఆమె. అతడు ఆమె వేపు చూసి అన్నాడు :

"ఐసిస్ సతి నా దారిని నన్నుపోనిస్తే ఆ గోడ్డు వేపు పోతాను."

గాలి అకస్మాత్తుగా ఓ కెరటంలా వచ్చి అతని టోపీని ఎగరగొట్టింది. అతడు తన చెయ్యి ఎత్తి టోపీ అణుచుకున్నాడు. ఆమె మళ్లీ అతని పాలిన చెయ్యీ, గాయపు మచ్చా చూసింది. "అదుగో! ఆగాయం!" అంది ఆమె చూస్తో.

"అవును!" అన్నాడు అతడు. "నాకు శలవు. ఐసిస్ కి నా నమస్కారాలు. నిద్రపోనిచ్చినందుకు ధన్యవాదాలు."

అతడు వెళ్లిపోతున్నాడు. కాని ఆమె వింతగా నీలంగా అతని వేపు చూసింది. "ఐసిస్ ని ఓ సారి చూస్తావా ?" అంది ఆమె అపుకోని ఓ ఉద్వేగంతో.

అతనిలో ఏదో బాధలా కదిలింది. "ఎక్కడయితే ?"

"రా !"—ఆమె వెనకాల అతడు గర్భ గుడిలోకి వెళ్లాడు. గర్భగుడి చీకటిగా ఉంది. ఆ చిన్న దీపపు వెలుగుకి అతని కన్నులు అలవాటుపడ్డ తరవాత దేవి విగ్రహం అతనికి కనబడింది. నడక వేగానికి ఆమె లంగా వెనక్కి ఎగిరుతో ఉంటే ఓ ఓడలా ఆమె ముందుకి నడుస్తోంది.

ఆమెకు అతడు వంగి నమస్కరించాడు. "ఐసిస్ గొప్ప దేవి!" అన్నాడు. "ఆమె అన్వేషణలో ఆమె చావుకంటే గొప్పది. ఆ నడక ఆమెలో అద్భుతంగా ఉంది. ఆదర్శం అద్భుతమయినది. పురుషులంతా నీకు వంగి నమస్కరిస్తారు. మగవానికి నువ్వు తల్లికంటేకూడా గొప్పదానవు."

ఐసిస్ సతి అంతా వింది. విని ధూపపాత్రలో సాంబ్రాణి పొడి చల్లింది. ఆ మనిషి వేపు చూసింది.

"ఇక్కడ నీకు బాగా ఉందా?" అని ఆమె అడిగింది.

అతడు కొంచెం కలిగిపోయి ఆమెనుచూస్తో, "నాకు తెలియదు," అన్నాడు.

కాని ఆమె తన మృత ఒసిరిస్ ఇతడేనని ఊహించుకుంటోంది. ఆమె ఆత్మ చురుక్కుమనేచోట ఆమెకు అల్లా తట్టింది. ఆమె విలవిల చలించింది. వింత సుగంధంతో నిండిన ఆ గర్భగుడిచీకటిలో అతనికి ఉండాలనిపించలేదు. పొద్దుటి చలిగాలిలోకి అతడు తిరిగివచ్చాడు. అతడు ఏదో తన స్పర్శకోసం తనకు తెలియకుండావచ్చి మీద పడుతున్నట్టు అనుకున్నాడు. అతని మాంసం మాత్రం ఇంకా బాధతో 'మాంమాస్పృశ! నన్ను ముట్టకోకు!' సూత్రంతో మెలివేసుకుని ఉంది. ఆ స్త్రీ అతని వెనకాల బయటి ఆవరణలోకి వచ్చింది. పిరికి ఆదుర్దాతో అతన్ని చూసింది. అతడు కదలిపోతున్నాడు.

"ఓ వెళ్లిపోకు! ఐసిస్ దగ్గర ఇంకో క్షణం ఉండు!"

అతడు ఆమెవేపు తిరిగిచూశాడు. ఆమెలో సూర్యుడు ఉదయించాడేమోనన్నట్టు ఆమె ముఖం పువ్వులా విచ్చింది.

అతని డొక్కలు ఒక్కసారి కదిలాయి. "ఐసిస్ యువతీ! నన్ను ఆపుతున్నావా?" అన్నాడు.

"ఆగు, నువ్వు ఓసిరిస్‌వని నాకు తెలుసు" అంది ఆమె.

చటుకుని అతడు నవ్వాడు "కాదు! ఇంకా అవలేదు!" అన్నాడు. ఆమె చిలిపిముఖం వేపు అతడు చూశాడు. "ఐసిస్‌కి ఇష్టమయితే ఇంకో రాత్రి ఆ గుహలో నిద్రపోతాను," అన్నాడు అతడు. పూజారిణి సహజమయిన బాల్యసంతోషంతో ఆమె చేతులు ఒకదానిలో ఒకటి ముడుచుకుంది.

"ఆ! ఐసిస్ సంతోషిస్తుంది," అంది ఆమె.

అతడు తీరంవేపు నడిచివెళ్లాడు. ఎంతో అలజడిపడుతో తనలో అనుకున్నాడు. 'ఈ స్పర్శకు నేను లొంగిపోనా? మానవులు తమ స్పర్శతో నన్ను చంపివేశారు. అయినా ఈ ఐసిస్ బాలిక స్పర్శ మృదువయిన మంటలా బాధ మాన్పుతుంది. నేను వైద్యుణ్ణి. అయినా నాలో ఈ బాలికా స్పర్శకున్న ఉపశమనశక్తిలేదు. ఈ బాలిక ఒకప్పుడు కల! వసంతంలో కాశీరత్నాలవంటి మృదుకల! కాశీరత్నము వంటి స్త్రీ శరీరంలో ఎంత మెత్తని దివ్యత్వం, ఎంత ఉపశమనం! నేను ఎందుకింత గుడ్డిగా అయిపోయాను? ఆహా! మృదుత్వం! నేను చచ్చిన చావుకంటే తీవ్రమయినది, అందమయినది...'

ఆ కొండవాలులో చిన్నచేపలు పట్టుకుని వేయించుకుని తిన్నాడు. అతనికి తిండి సహించింది. సముద్ర తీరపు రుచికి అతడు ఆశ్చర్యపడ్డాడు. అతని లోలోపల ఆలోచన చలిస్తోంది. 'నేనీ స్పర్శలోకి రాగలనా? ఇది చావుకంటె అవ

తల ఉంది. వాళ్లు నామీద చెయ్యిచేసుకొని చంపివేస్తే ధైర్యంగా లొంగిపోయాను. కాని ఈ మెత్తని జీవంతో స్పర్శలోకి రాగలనా?—అబ్బ! ఇది కఠినమయినది...'

కాని ఆ స్త్రీ గర్భగుడిలోకి మళ్ళీ వెళ్ళింది. ఎంతోసేపు ఊహలో మునిగిపోయి అల్లా కూర్చుంది. పెద్ద కోరికతో అడుగులువేసే దేవివేగాన్ని చూస్తోకూర్చుంది దేవి మొగ్గ వంటి కడుపులో సున్నితమయిన బొడ్డు, ఆ ప్రతీకయొక్క కన్నెరికపు పవిత్రతమీద ఓ ముద్రలా ఉంది. ఆమె దేవి. ప్రవాహావేగంలో తన జ్ఞప్తిని కొట్టుకుపోనిచ్చింది, తన స్త్రీత్వాన్ని పొంగి పొరల నిచ్చింది. సూర్యుడు కుంగేటప్పుడు ఆమె అతనికోసం భూమి నాలుక మీదికి వెళ్లింది. ఎండకు ఎదురుగా అతడు వెళ్ళినట్టు చూసింది. మొదట అతన్ని చూసినప్పుడు ఆమె నిలబడ్డ పైకె మోడులకింద ఎండుటాకుల మీద అతడు కూర్చున్నాడు. ఆమె ఆందోళనతో మెల్లగా అతని దగ్గరకు వచ్చింది. తన నతడు కోరడంలేదేమోనని కొంచెం జంకింది. అతనికి కనబడకుండా కొంతసేపునిలబడింది.

చటుకుని అతడు తన పెద్ద టోపీకిందనించి ఆమె వేపు చూశాడు. పడమటి ఎండ ఆమెజుట్టుమీద ఎర్రగా పడింది. అతడు అదిరిపడ్డాడు. అయినా ఆమెకోసం అతడు నిరీక్షిస్తోనే ఉన్నాడు. ఆ తెల్ల కట్టడంవేపుచూపిస్తో అడిగాడు: "అది మీ ఇల్లేనా?"

"మా అమ్మది, మా తండ్రి లేదు. ఆమెకు నేనొకతె కుమార్తెను."

"మీళ్ళంతా ఆమె బానిసలేనా?"

"కొంతమంది నా జాలిసలున్నారు."

వాళ్ళ చూపులు ఓక్షణం కలుసుకున్నాయి. "కూర్చో! సూర్యాస్తమయం చూద్దాం," అన్నాడుఅతడు.

ఆమెతో మాట్లేడేటప్పుడు అతడు లేవలేదు. అతనికి బాధ ఎంతో అనుభవంలో ఉంది. ఆమె ఆ గడ్డిపోచలమీద తనలంగా మోకాళ్ళమీదనించి సరిగా కప్పుకుని కూర్చుంది. ఓ పడవ గట్టుకి వస్తోంది. జాలిసలు చిన్నవలలు ఎత్తుతున్నారు. వెలితిగా వెలిగే ఎండలోనుంచి, ఆ పాయలోని నీడలోకి వస్తోంది. వాళ్ల కలకల నీటిమీాద పారివస్తోంది.

"అదేనా నీ ఇల్లు?" అన్నాడు.

"నేను అన్వేషణలో ఉన్న ఐసిస్‌ని సేవిస్తో ఉంటాను," అంది ఆమె.

అతడు ఆమెవేపు చూశాడు. ఆమెఊహలలో అల్లుకుపోయి ఎందుకో దూరంగాఉన్న మెత్తనిమబ్బులా ఉంది. అతని ఆత్మ తీవ్రతతో కరుణతో అతనిగుండెల్లో కొట్టుకుంది. నిజమైన సానుభూతితో అతడు అన్నాడు: "యువతీ నీకోరిక నీకు దొరికితీరుతుంది."

"అయితే నువ్వు ఓసిరిస్ కావా?" అని ఆమె అడిగింది.

అతనిముఖం ఎర్రబారింది. "నాబాధ నువ్వు ఉపశమింపజేస్తే అవుతానేమో" అన్నాడు. "చావుగా ఎడబాటు ఇంకా నామీాద ఉండిపోయింది. నేను దాన్ని దాటిపోలేను".

కొంచెం భయంగా ఆమె అతనివేపు చూసింది. ఆమె చూపులు నీలపుఎండలా ఉన్నాయి. ఆమె తలవంచింది. వారిద్దరూ నిశ్శబ్దంగా కూర్చున్నారు–చచ్చిపోయిన అతడూ,

స్వచ్ఛమయిన అన్వేషణలో ఆమే. శీతకాలపు రంగులు ప్రదర్శించుకుంటో సూర్యుడు ఆకాశపు అంచుదగ్గర కిందికి వంపుతిరిగి పోతున్నాడు. నిగనిగలాడే బానిసల నగ్న దేహాల మీద పడుతోంది ఎండ. ఒడ్డుమీది ఆలిచిప్పలమీద పరుగు లెత్తుకుంటో వాళ్ళు వలలు విప్పుతున్నారు. వాళ్ళ గొల్ల దేవుడు 'పాన్' శాంతిగా వాళ్ళని కాపాడుతున్నాడు. వాళ్లకి ఎప్పటికైనా పాన్ ఒక్కడే దేవుడు అవగలుగుతాడు.

సూర్యుడి అంచుమునిగిపోతో ఉంటే ఆమె లేచి నిలబడింది అంది: "నువ్వొండేట్టయితే అన్నమూ దుప్పటీ పంపుతాను."

"ఆమె, మీ అమ్మ, ఏమంటుంది?"

ఐసిన్ సతి అతనివేపు వింతగా చూసింది. కొంత జంకింది. "నావే నేను పంపుతాను."

కొద్దిగా నవ్వి, "మంచిది" అన్నాడు. కాని కొన్ని చిక్కులు ఉంటాయని అతడు గ్రహించాడు. వెళ్ళిపోతో ఉన్న ఆమెవేపు దీక్షగా చూశాడు. ఆమెనడకలో ఆత్మార్పణ స్ఫురిస్తోంది. ఆమె గుబురు తల కొంచెం వంగింది. ఉన్నిలంగా దంతపుమడమలమీద ఎగురుతోంది. నగ్నంగా ఆబానిసలు ఆమెవేపు కొంచెం చిలిపిగా చూశారు. ఆమె మాత్రం తదేకంగా ప్రహరీలో తలుపుతెరుచుకుని వెళ్ళి పోయింది.

చచ్చిపోయిన మనిషి ఆల్లాగే చెట్టు మొదట్లో కూర్చుని ఇసుకతిన్నె వేపు చూస్తున్నాడు. అంతా ఆతిన్నెమీదే జరుగుతుంది. ప్రహరీగోడ పక్కనించి ప్రవహించే చిన్న సెలయేటిలో ఆడబానిసలు గుడ్డలు ఉతుకుతున్నారు. వాళ్ళు

గుడ్డలు నున్నని రాతిపలకలమీద కొడుతోంటే గుల్లగా చాప్‌చాప్ అని ధ్వనిస్తోంది. అప్పుడే సముద్రపు పాయమీద చీకటి పడుతోంది. అవిశిచెట్లు రాలిన వాసన గాలిమీద తేలివస్తోంది. అవిశి గానుగల కిర్రు చప్పుడు అప్పుడప్పుడు కొద్దిగా వినబడుతోంది—దూరంగా ఆ తోటలో. గానుగ లాగే గాడిదను బానిస అదిలించే పిలుపుకూడా కొంచెం వినబడుతోంది. ప్రహరీతలుపు తెరచుకుని ఓ స్త్రీ ఇవతలికి వచ్చింది—తెల్లని ఉన్ని వలువలో నెరసిన జుట్టుగల ఓ స్త్రీ, ఆమెను అనుసరించి ఓ రోమక్ కూడా వచ్చాడు. ఆమె కింద ఉద్యోగి అయివుంటాడు. సముద్రపు ఒడ్డుని ఎత్తయిన ఆలిచిప్పలగుట్టమీద నిలబడి ఇద్దరూ చుట్టూ చురుకుగా చూశారు. ఎండకు కందిన దేహాలతో బానిసలు కింద వలల మీద వంగి ఏరుతున్నారు. బట్టలు ఉతికే స్త్రీలు బలంగా అరచేతిపట్టు రాతి పలకమీద రానిస్తున్నారు. ముసలిబానిస ఒకడు నీటి అంచుని నిలబడి చేపలు కడుగుతున్నాడు. ఆ స్త్రీ, ఆ ఉద్యోగీ అంతా ఓ చూపులో చూశారు.

చచ్చిపోయినమనిషి వారు తననిగురించి మాట్లాడుతున్నట్టు గ్రహించాడు. భూమినాలుకమీది పవిత్ర వాతావరణం లోంచి అతడు అవతలి సామాన్య లోకాన్ని చూస్తున్నాడు. ఆ లోకం ఇంకా అతనికి శత్రుత్వమే ప్రదర్శిస్తోంది. సూర్యుడు సముద్రపు అంచుని ముట్టుకున్నాడు. ఎదటి భూభాగం యొక్క నీడ సముద్రపు పాయమీద పడుతోంది. ఆలిచిప్పల పరుపుమీద చల్లటి నీలినీడలో ఆ వృద్ధస్త్రీ ఓనీడ లాగే నడుస్తోంది. ఆ నీడలోనే ముసలి బానిస కడుగుతున్న

చేపలు పరీక్షగా చూసింది. ముసలి జాలిస వంగి చేపలు తట్టలో పెడుతున్నాడు. అతని క్రొవ్విన పిరుదులూ భుజాలూ నారింజ రంగుగా మెరుస్తున్నాయి. ఆఖరి సూర్యుడు అతనిమీద ఒక్కసారి మెరిసి అస్తమించాడు. ముసలి జాలిస తదేకంగా పైకి చూడకుండా చేపలు కడుగుతున్నాడు. వృద్ధస్త్రీ కూడా నీడలో భాగమేనన్నట్టు అతడు ఆమెను గుర్తించనేలేదు. వెడల్పయిన తట్ట నెత్తిమీద పెట్టుకుని ఇద్దరు జాలిసపిల్లలు గుమ్మంలోనించి ఇవతలకి వచ్చారు. ఓ తట్టమీద పొడుగైన నూనెపాత్ర మధుపాత్ర పొడుచుకుని లేచి కనబడుతున్నాయి. గోడపక్కనే ఆలిచిప్పల గుట్టమీద వాళ్ళు నడిచి వస్తున్నారు. వాళ్ల వెనక ఐసిస్ సతి ఆకుపట్టు వలువలో ఇవతల కనుచీకటిలోకి వచ్చింది. సముద్రంమీద దూరంగా సూర్యుడు ఇంకా వెలుగుతున్నాడు. ఇక్కడమాత్రం నీడ కమ్మింది. నీటి అంచుని, నెరసినతల్లి, నిలబడి కుమార్తెను చూసింది. పచ్చగా తెల్లగా గుబురుజుట్టుతో జాలిసలవెనక నిర్లక్ష్యంగా తదేకంగా ఊగుతో ఆమె నడుస్తోంది. ఆమె తన మనః ప్రపంచంలో మగ్నఅయి భూమి నాలుక మీదికి వస్తోంది. తనచోటునించి కదలకుండా తల్లి చూసింది. ఆ ముగ్గురూ ఎత్తుగుట్టలు దాటి చెట్లచాటుకి కనబడకుండా పాయిపోయారు. జాలిసలెవరూ తల ఎత్తి చూడలేదు. కుమార్తె మాయమయిన చెట్లచాటువేపు నెరసినతల్లి అల్లాగే చూస్తోంది. మళ్ళీ ఆమె చెట్టు మొదట్లోకి చూసింది. చచ్చిపోయిన మనిషి అక్కడే కూర్చుని ఉన్నాడు

దూరాన్ని సముద్రంమాత్రం ఓ గీతలా మెరుస్తోంది. అప్పుడే సాయంకాలం అయిపోయింది. ఓర్పు! ఓర్పుకావాలి! విధి దానంతట అదే కదులుతుంది! తల్లి అవతల ఒడ్డుని గట్టిగా అడుగులు వేస్తో నడిచింది—కుమార్తెలా పెద్దగా తన్మయంగా కాదు. కాని గట్టిగా నిశ్చయంతో అడుగులు వేసింది. ఎదుటికొండవాలులోంచి ఇద్దరు బానిసలు వచ్చారు. భుజాలమీద పెద్ద పచ్చికమోపులున్నాయి. ఆచ్ఛాదనలేని వారికాళ్లు తెల్లగా పశువులకాళ్ళలాగ నిగ నిగ లాడుతున్నాయి. వాళ్ళతలలు కనబడడంలేదు. ఆలి చిప్పల పరువుమీద టకటకనడుస్తో వాళ్ళు వచ్చారు. నడవ డంలో మునిగిపోయి వాళ్ళు నడుస్తున్నారు. రోమక ఉద్యోగి పలకరించడంతోటే వాళ్ళు టక్కున ఆగిపోయారు. ఆస్త్రీ ఓచెయ్యి ఎత్తి భూమి నాలుకవేపు చూపించింది. పచ్చికమోపులతో బానిసలిద్దరూ గుడివేపు తిరిగి వెళ్ళారు. నెరసిన తల్లి ఉద్యోగి దగ్గరకు వచ్చింది. ఇద్దరూ మెల్లగా ప్రహారీలోపలికి వెళ్ళిపోయారు. బయట ఆలిచిప్పల పరువు దాటి కట్టడపుతోటలోకి వెళ్ళిపోయారు. క్రొవ్విన భుజాల ముసలి బానిస లేచి నిలబడ్డాడు. నీడలో అస్పష్టంగా చేపల తట్ట నెత్తిమీద పెట్టుకొని నిలబడ్డాడు. బట్టలు ఉతికే స్త్రీ సెలయేటిలోనించి గట్టుమీదికి ఎక్కింది, ప్రాణంఉన్న నీడలా. ఆమె ఉతికిన బట్టలు జంగిళ్ళలో గుట్టలుగాపేర్చింది. వలలు దులుపుతున్న బానిసలు వాటిని తెల్లగా మడతలు పెడుతున్నారు. ఉతికిన బట్టల జంగిడితో ఆమె, కడిగిన చేపల తట్టతో ముసలిబానిస, మడిచిన వలలతో ఆ ఇద్దరూ

భుజాలమీద తెడ్లతో ఓ కుర్రవాడూ, మడిచిన తెరచాప భుజంమీద పెట్టుకుని ఇంకో బానిస అంతా గుమ్మందగ్గర గుమిగా జేరారు. చచ్చిపోయిన మనిషి వాళ్ళ సంభాషణ మరమర ధ్వనిలా విన్నాడు. ఇంక గాలి చలిచలిగా వీస్తో ఉంటే వాళ్ళు లోపలికి వెళ్ళిపోయారు. అది చిన్న మను ష్యుల చిన్నతనపు జీవితం.

చచ్చిపోయిన మనిషి తనలో అనుకున్నాడు. 'ఈ చిన్న జీవితాన్ని పెద్ద జీవితంతో కలిపితేగాని, పెద్దజీవితపువృత్తం లోకి దీన్ని లాగితేగాని అంతా అపాయమే.'

కొండల కొసలుకూడా నీడలో మునిగిపోయాయి. సము ద్రం మాత్రం ఎక్కడో పయిని ఇంకా కొద్దిగా మెరుస్తోంది. సముద్రం ఓపాల నీడలాఉంది. చచ్చిపోయిన మనిషి నెమ్మ దిగా లేచి గుహవేపు తిరిగాడు. గుడిదగ్గర ఎవరూలేరు. కొండగుహలో తన ఆశ్రయం దగ్గరకు వెళ్ళాడు. మగ బాని సలు అతని పాతరెల్లు పరుపుతీసి రాతిపలక తుడుస్తున్నారు. దానిమీద అందంగా దర్భలు పరిచారు. పైన ఆ మోటు రెల్లుపరిచారు. దానిమీద మెత్తని పొదల ఆకులు ఒత్తుగా పరిచారు. దానిమీద ఎద్దు చర్మం పక్క వేశారు. ఆడ బాని సలు మడిచిన ఉన్ని దుప్పట్లు పక్కమీద పెట్టారు. మధు పాత్ర, నూనెపాత్ర, తాగేచిప్ప, రొట్టె జంగిడీ, ఉప్పు, వెన్న, ఎండిన అత్తిపళ్ళు, కోడిగుడ్లు చక్కగా అమర్చి ఉన్నాయి. చిన్న బాగ్గుకుంపటి ఒకటి ఉంది. గుహ అకస్మాత్తుగా మారిపోయింది కాపురం ఉండే ఇల్లులాగ. నీటిజల పక్కని వెలిత్తిలో ఐసిస్ సతి నిలబడిఉంది. సన్నపాటిదారిలో ఒకొక్క

సారి ఒక బానిసే వెళ్ళగలడు. చచ్చిపోయినమనిషి రాగానే ఐసిస్‌సతి ఆడబానిసలని పంపి వేసింది. మగబానిసలుమాత్రం పక్కపరిచేపని తాపీగా ఆలస్యంగా చేస్తున్నారు. వాళ్ళని కూడా ఆమె పంపివేసింది. చచ్చిపోయినమనిషి తన ఇల్లు చూసుకున్నాడు.

"సరిగా ఉందా?" అని అడిగింది ఆమె.

"సరిగానే ఉంది" అన్నాడు అతడు. "అయితే మీ అమ్మ, ఆ ఉద్యోగి, ఈ బానిసలు తెచ్చేవన్నీ చూస్తున్నారు. వాళ్ళు నిన్ను అడ్డుపెట్టరూ?"

"నాభాగం నాదే. నాభాగం నేను ఇవ్వడానికేం? నన్నూ నా దేవుళ్ళనీ ఎవరు అడ్డుపెట్టేది?"

ఆమెకొంచెం రోషంగా మాట్లాడింది. ఆమెగొంతుకలో కొంత నిస్పృహకూడా ఉంది. తల్లి ఆమెను అడ్డుపెడుతుందని అతడు గ్రహించాడు. చిన్నజీవితంలోని చైతన్యం పెద్ద జీవితంలోని చైతన్యాన్ని ఎదురుకుంటోంది.

అతడు అనుకున్నాడు: 'ఈ ఐసిస్‌సతి దైనికజీవితంలో తనభాగాన్ని ఎందుకు వదులుకుంది? ఆమె తనహక్కులు బలవంతంగా నిలబెట్టుకోవలిసింది.'

"నువ్వు భోజనం చేస్తావా?" అంది ఆమె. ఆ నిప్పుల మీద వేడిగుడ్లు ఉన్నాయి. నేను భోజనానికి ఇంటికిపోతాను. రాత్రి రెండోజాము వేళ గుడిదగ్గరకు వస్తాను. నువ్వుకూడా ఐసిస్ దగ్గరకు రావూ?"

ఆమె అతనివేపు చూసింది. ఓ వింత మెరుపు ఆమెకళ్ళలో పెద్దగా మెరిసింది. అదే ఆమె కల. ఆమెను మించినది

ఆ కల, ఇప్పుడుమాత్రం అతడు ఆమెను ఏచిన్నవిషయం లోనూ నొప్పించలేదు. ఆడుతనపువై చిత్రి ఆమెలో సంపూర్ణంగా వెలుగుతోంది.

"గుడిదగ్గర నేను వేచిఉండనా?" అని అడిగాడు.

"తప్పకుండా! రాత్రి రెండోజాముకి నేను వస్తాను."

ఆమెగొంతుకలో జుమ్మని దాగిపోయినసూచన అతడు విన్నాడు. అతని రోమాలు పులకించాయి. "అయితే ఆమె? మీరా అమ్మ?" అని మెల్లగా అన్నాడు.

ఆమె అదరిపడి అతనివేపు చూసింది. "ఆమె నన్నేం చేస్తుంది?" అంది ఆమె.

అంచేత తల్లి ఆమె నేదో చేస్తుందని అతడు గ్రహించాడు. ఆమె తల్లిచేతిలో తన స్వత్వాన్ని పెట్టివేసింది. ఆబలం ఇప్పుడు తల్లి ఆమెమీద ఉపయోగిస్తుంది.

ఆమె వెళ్ళిపోయింది. అతడు పక్కమీద వెల్లకిల పడుకున్నాడు. నిప్పులమీది గుడ్లుతీసుకుని తిన్నాడు. రొట్టె నూనెలో ముంచి తిన్నాడు. అతనిశరీరం ఎండిపోయి ఉంది. మధువూ నీరూ కలిపి తాగాడు. నిశ్చలంగా పడుకున్నాడు. దీపం కదలకుండా మొగ్గలా వెలుగుతోంది. అతడు కొత్త ఉద్వేగాలతో మునిగి చిక్కుపడిపోయాడు. ఐసిన్‌సతి అతనికి ఎంతో హృద్యంగా ఉంది. రూపమే కాదు. ఆమెలో ఆడతనపువెలుగు వింతగా నిండిఉంది. సూర్యమండలానికి అవతలి సూర్యులు ఆమెను కొత్తవెలుగులో ముంచెత్తుతున్నారు. బలమయిన ఆడతనపువెలుగులో, ఆమెను తాకితే సూర్యుని తాకినట్టే. అన్నిటికంటే ఆమెకు అతనియందున్న

మెత్తనికోరిక, ఎండలా నిర్మలంగా, వెచ్చగా ఉంది. 'ఆమె నామీద ఎండలా వాలుతోంది' అనుకున్నాడు అతడు. చేతులూ కాళ్లూ జాపుకున్నాడు. 'ఇటువంటి ఎండలో ఎప్పుడూ నా కాళ్లూ చేతులూ నేను జాపుకోలేదు—ఆమె కోరికవంటి నునువెచ్చని ఎండలో. అందరికంటే గొప్ప దేవుడే నాకీ వరం ప్రసాదించాడు.'

కాని అతనికి బయటిలోకాన్ని గురించి కొంత భయం కూడా ఉంది. వాళ్లకి చేతనయితే మమ్మల్ని చంపేస్తారు, అని తనలో అనుకున్నాడు. 'కాని మమ్మల్ని రక్షించే న్యాయంకూడా ఒకటి ఉంది.' మళ్లీ తనలో అనుకున్నాడు: 'నేను మేలుకున్నప్పుడు నగ్నంగా, గాయాలతో మేలుకున్నాను. కాని ఈ స్పర్శకి నేను నా నగ్నదేహాన్ని అర్పించ గలిగితే నేను ఊరికే చచ్చిపోలేదు.'

అతడు లేచి బయటకు వెళ్లాడు. రాత్రి చలిచలిగా నక్షత్రాలతో నిండిఉంది. గాలి పెద్దగా గొప్పగా నిండి పోతోంది. లోభమూ, నీచమూ, బాధా ఈఘోర దుర్బుద్ధులకుపైన స్వర్గాన్ని చూపించే విధికూడా ఒకటి ఉంది. అతడు నిశ్శబ్దంగా గుడిదగ్గరకు వెళ్లాడు. చీకట్లో లోపలి గోడకు జేర్లబడి బయటి చీకటినీ, నక్షత్రాలనీ, చెట్లఅంచులనీ చూస్తున్నాడు. తనలో మళ్లీ అనుకున్నాడు : 'స్వర్గాన్ని చూపించేవిధితప్పకుండాఉంది. ఎక్కడో ఓపెద్దశక్తిదాగిఉంది.'

అప్పుడు ఆమె పట్టువలువ దూరంగా దీపంవల్ల నిగనిగలాడింది. అతడు చూశాడు. దీపం చెట్లమాటుని ఆగి ఆగి కనబడుతో వస్తోంది. కాని తొందరగా వస్తోంది. ఆమె

ఒంటరిగా దగ్గరగా వస్తోంది. ఆమె పట్టువలువమీద దీపం మెల్లగా జారుతోంది. సంతోషంతో భయంతో అతడు వణికాడు. తనలో అనుకున్నాడు: 'నాకు చావుకంటే ఈ స్పర్శ అంటేనే ఎక్కువ భయంగా ఉంది. చావుకంటే ఎక్కువగా ఈ స్పర్శ నా నగ్నదేహాన్ని పరిపూర్ణంగా ముంచివేస్తుంది. "నేను వచ్చాను ఐసిస్ సతీ!" అన్నాడు ఆ చీకట్లోంచి మృదువుగా.

"ఆఁ!" అంది ఆమె, భయంతో, ఓతన్మయతతో.

ఆమె తనకలలో తన్ను లీనంచేసుకుంది. ఆమె గుడి తాళం తెరిచింది. అతడు ఆమెను అనుసరించాడు. ఆమె లోపల తలుపువేసింది. గుడిలో గాలి వెచ్చగా, సువాసనగా, దగ్గరగా ఉంది. చచ్చిపోయినమనిషి తలుపుదగ్గర నిలబడి ఆమెను చూస్తున్నాడు. ఆమె దేవిదగ్గరకు ముందువెళ్లింది. సగంవెలిగిన ఆ దేవతావిగ్రహం ఎక్కడికో ముందుకి వ్యాపిస్తో నిలబడి ఉంది. కొంచెం భయంగా ఉంది విగ్రహం. ముందుకు తోసుకువచ్చే నిరవధికమయిన ఆడతనంలా ఆమె ప్రత్యక్షమయింది. పూజారిణి అతన్ని తిరిగి చూడలేదు. తన మేలి ముసుగు తొలిగించి కర్రకుర్చీమీద పెట్టింది. దీపపు సగంవెలుగులో ఆమెచేతులు నగ్నంగా తెల్లని అంగరఖాలో నించి బయటికి సాగివచ్చాయి. ఇంకా అతన్నించి ఆమె తన్ను తాను దాచుకుంటోంది. ఆమె మెల్లగా ధూపపాత్ర విసిరి రగిలించి, సాంబ్రాణిపొడి చల్లింది. గాలిమీద పల చని తెరలా సుగంధధూమం వ్యాపించింది. ప్రథమపూజలో మునిగి ఆమె దేవివేపు తిరిగి నిలబడింది. సముద్రపు ఒడ్డున

కట్టివేసిన చిన్నపడవలా ఆమె అనుక్షణం దేవిదగ్గరకు ప్రాకి పోతూ ఉన్నట్టు అనిపించింది. ఆవింత తన్మయతలో ఆమెను అతడు చూశాడు.

తనలో అనుకున్నాడు: "ఆమె ఆడతనపు వైచిత్రిలో, తన్మయతలో ఆమెను నేను వదలివెయ్యాలి."

ఆమె అల్లాగే పడవలా దేవి వేపు ఊగుతూ తేలిపోతోంది. గ్రీకుభాషలో ఆమె ఏదో తనలో తను ప్రార్థించుకుంది. అతనికి అర్థంకాలేదు. క్రమంగాఆమె కెరటాలులేనిసముద్రం మీద పడవలా నిశ్చలంగా అయిపోయింది. అతడు ఆమెను చూస్తూ ఆమె ఆత్మయొక్క ఒంటరితనాన్ని గ్రహించాడు, ఆడతనపు భేదాన్ని గ్రహించాడు. తనలో అనుకున్నాడు.

"ఆమె నాకంటె ఎంత భిన్నంగా ఉంది! ఎంత వింతగా భిన్నంగా ఉంది! నా మగతనపు తేడా ఆమెకు భయం వేస్తోంది. ఆమె ఆ భయాన్ని తొలిగించుకుని నగ్నంగా అవుతోంది. ఎంత సున్నితంగా, ఎంత మృదువుగా, ఎంత సజీవంగా ఉందిఆమె! నానించి ఆజీవం ఎంత తేడాగాఉంది! జీవంయొక్క మెత్తని ధైర్యం నా కఠినమైన చావుయొక్క ధైర్యంకంటే ఎంత భిన్నంగాఉంది! గులాబిపువ్వుగుండెలా, జ్వాలయొక్క అంతఃకుహరంలా ఆమె దివ్యంగా ఉంది. తన అంతఃకుహారాలు చీల్చుకుపోవడానికి ఆమె సంపూర్ణంగా తన్ను తాను సిద్ధంచేసుకుంటోంది. ఆమెమీద హద్దుమీరితే ఎంత ప్రమాదం! ఆమె ఆశను విఫలపరిస్తే ఎంత ప్రమాదం!"

ఆమె అతని వేపు తిరిగింది, దేవివల్ల ఆమెముఖం వెలుగు తోంది. "నువ్వు ఓసిరిస్ కాదూ?" ఆమె ఎంతో సహజంగా

అడిగింది. "నీ ఇష్టమైతే," అన్నాడు అతడు.

"ఐసిస్ అన్వేషణకి నువ్వు లొంగుతావా? నీ దుస్తులు తీసి వెయ్యవూ?"

అతడు ఆమెవేపు చూశాడు. అతని ఊపిరి గొంతుకలో అడ్డింది. అతని గాయాలు, ముఖ్యంగా అతని కడుపులో చావువంటి గాయం మళ్లీ పెద్దగా రోదన ప్రారంభించాయి. "అబ్బ! బాధ!" అన్నాడు. "నే నింకా జంకుతో ఉన్నందుకు నువ్వు క్షమించాలి."

కాని అతడు దుస్తులుతీసివేసి దేవివేపు నగ్నంగా నడిచి వెళ్ళాడు. అతని ఊపిరి పెద్దబాధవల్ల భయంతో ఎక్కిఎక్కి వస్తోంది - బాధయొక్క స్మృతివల్ల, మితిలేని దుఃఖంవల్ల తనకు తనే క్షమార్పణగా అన్నాడు: "వాళ్లు నన్ను చంపివేశారు" తన ముఖం ఓక్షణం ఆమెవేపు తిప్పాడు. చావుయొక్క ఛాయ అతనిలో ఆమెచూసింది. అతడు నగ్నంగా, పీలగా చావులా ఆమెముందు నిలబడ్డాడు. ఆమె చటుకుని భయపడింది. ఏదో పోగొట్టుకున్నట్టు ఆమెకు అనిపించింది. చావు తెల్లటి రెక్కలు ఆమె ముందు విజిగీషతో విప్పుకొని ఆవరించినట్టు ఆమెకు అనిపించింది. తన భాషలో అతడు దేవితో అన్నాడు:

"దేవీ! నేను మళ్లీ బతకాలని ఎంతో కోరుతున్నాను. నా జారిపోయిన రహస్యతత్వం నాకు మళ్లీ ప్రసాదించు."

అప్పుడు మళ్లీ అతనికి ఆఖరిఆశ నిరాశలా అంకురించింది. ఓపక్కని ప్రాణం తన నించి ఒకటి కోరుతోంది. రెండో పక్క చావు బరువుగా అణిచివేస్తోంది.

"ఆ గాయాలకు నేను మందురాస్తాను. నాకు చూపించు, నన్ను మందు రాయనియ్యి."

అతడు తిరిగివచ్చిన పాతబాధలో తన నగ్నత మరచి పోయాడు. కర్రబల్లచివరకూర్చున్నాడు. అతని చేతిలో ఆమె కొంత మందుపోసింది. మందు మర్దనాచేస్తోంటే అతనికి అన్నీ జ్ఞాపకం వచ్చాయి— ఆ చిల్లులు, మేకులు, ఆ క్రౌర్యం, అన్యాయమైన ఆ క్రౌర్యం, కేవలం కరుణే ధారపోసిన అతని యెడల వాళ్లుచూపిన క్రౌర్యం, అన్నీ జ్ఞాపకంవచ్చాయి. తను చచ్చిపోయిననాటి, అన్యాయమూ, బాధా, క్రౌర్యమూ, మళ్లీ అతన్ని ఆవరించాయి. కాని, ఆమె మెల్లగా ఏదో మాట్లాడుతూ మర్దనచేస్తోంది! చినిగిపోయినచోట మళ్లీ క్రొత్త మాంసం నిండుకుంటుంది. గాయమైనచోటు మళ్ళీ క్రొత్త ప్రాణంతో నిండిపోతుంది. ఈ గాయం ఒక నీలోత్పలపు కన్నులా ఉంది. పూజారిణీ సహజమైన ఆమె తద్దైక్యం చూసి అతనికి చిరునవ్వు రాకతప్పలేదు. అది ఆమె కల. అతడు ఆమెకు ఓ స్వాప్నికవస్తువు మాత్రమే. అతన్ని గురించి ఎన్నడూ సంపూర్ణంగా ఆమె తెలుసుకో లేదు, ఐతే ఏం? ఆమె వేరు. ఆమె ఆడుది. ఆమెబతుకు, ఆమె స్వప్నం అవీ వేరు. అతనికి మాత్రం ఆమె మంచిది కాగలిగింది. ఆమె అతని కాళ్లు మెల్లగా శమనగా శ్రద్ధతో ఉంటే అతడు ఇలా అనకుండా ఉండలేకపోయాడు :

"ఇదివరకు ఓ స్త్రీ తన కన్నీళ్ళతో నా కాళ్లు కడిగింది. తన శిరోజాలతో తుడిచింది."

ఐసిస్ సతి ఓ క్షణం ముఖమెత్తి అతన్ని చూసింది. తన

దీక్షలో అంతరాయం కలిగినందుకు కొంత చిరాకు పడింది.

"అప్పుడు గాయపడ్డాయా నీ కాళ్లు?" అని అడిగింది.

"లేదు లేదు! అంతకుముందు సరిగా ఉన్నప్పుడే."

"నువ్వామెను ప్రేమించావా?"

"ప్రేమ ఆమెను దాటిపోయింది. ఆమె నాకు ఊరికే సేవచెయ్యాలని చేసేది" అన్నాడు అతడు. "ఆమె ఒక వేశ్య."

"ఆమెను సేవచెయ్య నిచ్చావా?" అని ఆమె అడిగింది.

"ఆ!"

"ప్రేమ చచ్చిన మృతకళేబరంతో ఆమెను ముట్టుకో నిచ్చావా?"

"అవును!" అతనికి అకస్మాత్తుగా తట్టింది: "వాళ్ళ నందరినీ కూడా ప్రేమ చచ్చిన మృతకళేబరాలతోనే సేవ చెయ్యమన్నాను. చివరకి నా మృతకళేబరమే వాళ్ళకి అర్పించాను. ఇదుగో నా దేహం...తీసుకోండి...తినండి... నా శవం..."

"హద్దులేని సిగ్గు అతన్ని ఆవహించింది. అతడు అనుకున్నాడు: 'చివరకి వాళ్ళనందరినీ చచ్చుప్రేమతో ప్రేమించమన్నాను. నేనుగనక జూడాస్‌ని సజీవమైన ప్రేమతో ఆదరించినట్టయితే అతడు నన్ను చావుతో ఆదరించకపోను. అతడు నా రక్తమాంసాలని నిజంగా ప్రేమించే ఉంటాడు. కాని దేహరహితంగా, ప్రేమచచ్చిన మృతకళేబరంతో నన్ను ప్రేమించమని అతన్ని కోరాను."

స్పర్శలోని వెచ్చని సజీవమైన ప్రేమ అతని మాంసంలో మృదువుగా ఉదయించింది. అది సంపూర్ణమైన ఆనందం.

తనలో అనుకున్నాడు. 'ఏడిచినవాళ్లు ముక్తి పొందుతారని వాళ్ళతో అన్నాను. ఇప్పుడు నేను చచ్చిపోయి ఉన్నాను. ఈ స్త్రీవిషయమై నేను ఏడిచినట్టయితే అల్లా చావులోనే ఉండిపోతాను. నాకు ఎంతో బతకాలనిఉంది. జీవితం నన్నిక్కడికి ఈడ్చుకొని వచ్చింది - వెచ్చని చేతులుగల ఈస్త్రీ దగ్గరకి. నా బోధలన్నిటికంటే ఆమె స్పర్శ నాకు ముఖ్యమైనది. నేను బతకాలని కోరుకుంటున్నాను'

"దేవి దగ్గరకు నడు!" అని ఆమె మెల్లగా అతన్ని ముందుకు తోసింది.

అతడు కలిగిపోయి నగ్నంగా పుట్టుకలేని వస్తువులా నిలబడి ఉంటే ఆమె దేవిని మెల్లగా తనలో ప్రార్థనా పూర్వకంగా పూజిస్తోంది. ఆమె మోకరించింది. అతని డొక్కలోని పెద్దగాయపుగుంటలో మెత్తనిమాంసం ఆమె చూసింది. ఆ గాయం నిత్యమూ దుఃఖించే కన్నులా ఉంది. అక్కడే అతనిరక్తం హరించిపోయింది. అతని వీర్యం హరించిపోయింది. గ్రీకుభాషలో ఆమె మెల్లగా దేవిని స్మరిస్తోంది. చచ్చిపోయినచావు తిరిగి తిరిగి రావడంలో, ప్రాణాన్ని బలవంత పెట్టిన ఆదుర్దా కంగారులో అతని గాయాలు పెద్దగా రోదిస్తున్నాయి. అతని దేహపు లోతులలో రోదన ధ్వని మోగుతుంది.

"నేను హత్య చెయ్యబడ్డాను. హత్యకు నన్ను నేను అర్పించుకున్నాను. వాళ్లు నన్ను చంపివేశారు. కాని, నేనే చావుకి లొంగిపోయాను."

ఆ స్త్రీ మాత్రం నిశ్శబ్దంగా వణుకుతో చేతిలో నూనె

పోసుకుని అతనికుడిడొక్కలో గాయంమీద తన అరచెయ్యి కప్పింది. అతడు తూలిపోయాడు. గాయం అతని ప్రాణాలు హరించివేసింది—ఇదివరకు అనేకసార్లు హరించినట్టుగానే. ఆ అంధకారంలో, బాధలో, అతని జ్ఞప్తి నిండా ఒకటే అరణ్యరోదన మోగింది: 'అబ్బ! నాలో దీన్ని ఆమె ఎల్లా తీసివెయ్యగలదు? ఈ చావు నాలోంచి ఆమె ఎల్లా తీసి వేస్తుంది? ఆమె ఎన్నటికీ తెలుసుకోలేదు. ఆమె ఎన్నటికీ గ్రహించలేదు. ఆమెవల్ల కాదు......'

ఆమె మెల్లగా, మెల్లగా నిశ్శబ్దంగా గాయంమీద నూనె రుద్దుతోంది. పూజారిణీ సహజమైనతదైక్యంతో నెమ్మదిగా బలం తెచ్చుకుంటో ఆమె రుద్దుతోఉంటే అతని కేంద్రాలు అదిరి రోదిస్తున్నాయి. కాని, ఆమె క్రమంగా బలం తెచ్చు కొని కుడినుంచి ఎడమగాయం దగ్గరికి తిరిగేసరికి కొంత వెచ్చదనం అతని భయాన్ని పోగొట్టింది.

అతడు అనుకున్నాడు: 'నేను మళ్ళీ వెచ్చగా అవుతా నేమో! నేను మగవాణ్ణి అవుతాను. దీనికి తెలివి అక్కర లేదు. కొత్తదనం కావాలి. ఆమె నాకు కొత్తదనం అందిస్తోంది......'

అతని జ్ఞప్తికి పొలిమేరల్లో అతని గాయాలు ఎడతెరిపి లేకుండా రోదిస్తోఉన్న సన్ననిధ్వని అంతకంతకుతగ్గిపోతుంది. ఆమెకు తెలియదు! నాలోని చావు ఆమె గ్రహించలేదు. కాని ఆమెకు ఇంకో గ్రహణశక్తి ఉంది. చీకటికి రెండోకొస నించి ఆమె నాదగ్గరకు వస్తోంది. అతని నడుముకింద అంతా నూనె మర్దనాచేసి పూజారిణీసహజమైన మెల్లని తీక్ష్ణతతో,

పట్టుదలతో పనిచేసి, అతని గాయాల రోదనధ్వని అంత కంతకు దూరంగా తొలిగిపోతోఉంటే, చటుకున ఆమె తన రొమ్ము అతని ఎడమగాయాలకు తగిలేటట్టు కౌగిలించుకుంది. తన చేతులతో అతన్నిచుట్టి, అతని గాయాలను తన దేహ స్పర్శతో వెచ్చనినదిలో మడతలలా కప్పివేసి, సజీవమైన బలంతో అతన్ని దగ్గరగా హత్తుకుంది. అతనిలో రోదన పూర్తిగా ఆగిపోయినది. అతని ఆత్మలో ఓచీకటి, ఓశాంతి, నిశ్చలమైనశాంతి, ఓపరిపూర్ణత నిండిపోయాయి. అతని మగ తనం లోలోపల అంధకారంలో మెల్లగామెల్లగా ఏదోఏదో కదిలినట్టు కదిలి పైకివస్తో ఉన్నట్టు అతనికి అనిపించింది. ఓ ఉదయం, ఓ క్రొత్తసూర్యుడు, అతని లోలోపలి అంధకారం లో ఓ క్రొత్తసూర్యుడు ఉదయిస్తున్నాడు. భయంతో, ఆశతో, ఊపిరిఆపుకుని ఆ ఉదయంకోసం అతడు వేచి చూ స్తున్నాడు—'నేనిప్పుడు నేను కాను. నేనొక కొత్త నేను...'

కాని చటుకుని ఏదో జారిపోయింది. నిస్పృహయొక్క చల్లటిఊర్పుతో తననిచుట్టిన సజీవస్త్రీదేహం సడలిపోవడం అతడు గ్రహించాడు. వెచ్చదనమూ వెలుగూ అతన్ని మోడులా వదలివేశాయి. దేవిపాదాలదగ్గర ఆమె అలసి పోయి ముఖం దాచుకుని పోగుపడిపోయింది. అతడు వంగి నిగనిగలాడే ఆమెవెచ్చని భుజంమీద మెల్లగా నిమిరాడు. కోరిక విద్యుత్తులా అతనిలో ప్రవహించింది. ఇది ఇంకో చావా అనుకుని ఆశ్చర్యపడ్డాడు. కాని ఇది అద్భుతమైనది. ఇప్పుడు అతని తెలివిఅంతా ఆ పోగుపడి దాగిఉన్న స్త్రీలో కేంద్రీకరించింది. ఆమెపక్కని అతడు ఒదిగి గుడ్డిగా ఆమెను

నిమిరాడు. అర్థంలేని వేవో రహస్యాలలా గొణిగాడు. అతని చావూ, ఆత్మార్పణయందు అతని ఉత్సాహం, అతనిసందేశం అన్నీ గాలిలో కలిసిపోయాయి. వంగి పొగుపడిన ఆ స్త్రీ మూర్తియొక్క పరిపూర్ణత ఒక్కటే అతనికి తెలుసును. ఆమె జీవితంఅనే తెల్లనిపర్వతం లాఉంది......'ఈపర్వతం మీదే నన్ను నేను సృష్టించుకున్నాను. చీలిపోయే గాఢమైన పొరలలో ఒదిగిన ఈస్త్రీ జీవితపు పర్వతం...'

ఆమెఇంకా ముఖం దాచుకుంది. ఆమెమీదసూర్యోదయం లా అతడువంగాడు. ఆమెను కప్పుకున్నాడు. అతనిమగతనం అగ్నిలా, శక్తిలా అతని డొక్కలలో అద్భుతంగా లేచింది.

'నేనుతిరిగి మేలుకున్నాను!'

అతని డొక్కలలో వెయ్యివెలుగుల్లా ధగ ధగ లాడుతో అతని సూర్యుడు ఉదయించాడు. తనవేడి అంగ అంగాలకూ విద్యుత్తులా ప్రవహింపజేశాడు. అజ్ఞంగా అతని ముఖం ధగ ధగ మెరిసింది. ఆమె పట్టువలువమీది కట్టుదారం అతడు సడలించాడు. వలువకిందికి జార్చివేశాడు. ఆమె రొమ్ములు తెల్లని బంగారంలా మెరిశాయి. వాటిస్పర్శలో అతనిప్రాణం ఒక్కసారిగా కరిగి ప్రవహించింది. "తండ్రీ! ఇదంతా నా దగ్గిరనించి ఇంతవరకూ ఎందుకు దాచావు?" అన్నాడు.

కోరిక తన హద్దులనుదాటి పైకి పొడుచుకుపొయ్యేటట్టు ఆమెను స్పృశించాడు. "అబ్బ! ఇది తపస్సుకంటె గొప్పది" అన్నాడు. "ఆస్త్రీ గులాబిలో గుండెవంటిది. లోతుగా దళాలు కప్పుకున్న గులాబి! స్పర్శకు చీలిపోయే వెచ్చదనంగల ఈ గులాబి నా పరమావధి. ఈమొగ్గ నా ఆనందం."

...కుని ఆమె అతనివేపు చూసింది. తన ముఖం ఓ వెలుగులా ఎత్తింది. వింతగా మృదువుగా, ఆమె కళ్ళు మంచులో తడిసిన అనేక పువ్వుల్లా వున్నాయి - అన్నిటినీ మింగేకోరికతో ఆమెను మృదువుగా తన గుండెకు హత్తుకున్నాడు. ఒకటే ఆఖరిఊహ: 'నా సమయం వచ్చేసింది. అకస్మాత్తుగా నన్ను అవరించింది...'

ఆమె నతడు తెలుసుకున్నాడు. ఆమెలో కలిసిపోయినాడు.

తరవాత కొంతసేపటికి ఆమె అతని పెద్దగాయాలు వేళ్ల తో తాకుతో అంది: "ఇంక నీకు అవి బాధపెట్టవూ ?"

"అవి సూర్యులు !" అన్నా డతడు. "నీ స్పర్శవల్ల అవి వెలుగుతాయి. నీ కలయికతో వాటికి ఉపశమనం."

ఇద్దరూ గుడివదిలి ఇవతలికివచ్చేసరికి ప్రత్యూషంముందు వేసేచలిగాలి వీస్తోంది. తలుపుమూసేముందు దేవి వేపు ఇంకోసారి అతడు చూశాడు. అన్నాడు: "ఐసిస్ గొప్ప దేవి. కరుణామయి. మెత్తదనంయొక్క అవతారం. గొప్ప దేవుళ్లంతా వేడి గుండెవాళ్లు. వాళ్ళందరికీ మృదువైన దేవేరు లుంటారు."

ఆమె తన ఫేలిముసుగు కప్పుకుని గుడ్డిగా ఇంటికివెళ్ళి పోయింది. తనబంగారు కుహరాలు కొత్తజీవంతో నింపుకుని ముడుచుకుపోయినపద్మంలా ఊగుతో వెళ్ళిపోయింది. ఆమెకు ఏమీ కనబడడంలేదు. ఆమెదళాలే ఆమెను కమ్మివేశాయి. ఆమెమాత్రం తనలో అనుకుంది: "నేను ఓసిరిస్‌తో నిండి పోయాను. మేలుకున్న ఓసిరిస్ నాదేహంలో నిండిఉన్నాడు"

ఉదయం ముందు వెలవెల స్పష్టంగా మెరిసే నక్షత్రాల

నతడు చూశాడు. అవి సముద్రంవేపు రాలిపోతున్నాయి. ఆకుపచ్చగా ధ్రువనక్షత్రం సముద్రపు అంచుమీద కనబడుతోంది. అతడు అనుకున్నాడు: "ఎంతమెత్తన! ఎన్నిఎన్ని మృదువయిన వంపులు! చీకటి దళాలగులాబిలా, మంచు తాకినచోటల్లా తన నల్లనిదళాలు విచ్చుకునే గులాబిలా ఎంత నిండు! అన్ని దేవుళ్ళకంటే ఎంత గొప్పది! నాచుట్టూ ఎల్లా ఆవరించుకుంది! నేను అందులో భాగమయిపోయాను, ఈ అవకాశమనే పెద్దగులాబిలో. దానిసుగంధంలో నేనొక అణువును దాని అందంలో ఆమె ఒక అణువు. లోకం అనేకదళాలలో ఒదిగిపోయిన ఓ చీకటిపువ్వు. ఓ స్పర్శలా దానిసుగంధం నన్ను ఆవరించుకుంది."

అందుకని ఆస్పర్శయొక్క పరిపూర్ణతలో, నిరవధిక ప్రశాంతిలో అతడు తనగుహలో నిద్రించాడు. ఉదయమైన తరవాత గాలి బలమైంది. తడివాన, చలి తుపాను రేగాయి. అతడు తనప్రశాంతిలో, స్పర్శలోఉన్న ఆనందంలో గుహలోనే ఉన్నాడు. సముద్రాన్ని సంతోషంగా వింటున్నాడు. నేలమీదపడే వానని వింటున్నాడు. ఓ గులాబి వానలో తడిసి తెల్లబంగారురంగుతో బరువుగా కిందికి వేలుతోంది.

తనలో అతడు అనుకున్నాడు: "ఇదే ఒకపెద్దప్రక్రియ. ఈస్పర్శ, ఈ బూడిదసముద్రం, వాన, ఈతడిగులాబి, నేను వేచిఉండే ఐసిస్‌సతి, కనబడని ఆ ఐసిస్ దేవత, ఆమెకందని ఓసిరిస్ సూర్యుడూ అంతా ఒక స్పర్శలో కలిసిపోయాం."

ఆమెకోసం గుడిదగ్గరకు వెళ్ళాడు. ఆమె వానలో నడిచి వచ్చింది. కాని ఆమె అంది: "నేను ఓక్షణం ఐసిస్‌దగ్గర

ఒంటరిగా కూర్చుంటాను. నువ్వు రాత్రి రెండో జాము నాదగ్గరకురా. వస్తావుకదూ!''

అతడు తిరిగి గుహదగ్గరకు వెళ్ళిపోయాడు. స్పర్శలో ఉన్న సంతోషంతో ప్రశాంతిగా అక్కడ పడుకున్నాడు. స్పర్శను మళ్ళీ దృఢపరిచే రాత్రి రెండో జాముకోసం వేచి అల్లా పడుకున్నాడు. తరవాత, చీకటిపడినతరవాత ఆమె కూడావచ్చింది. సంతోషంగా వచ్చింది. అతనితో స్పర్శ కోసం, గాఢమయిన స్పర్శకోసం తహతహ ఆమెనుకూడా ఆవరించింది. అల్లా పగళ్లు గడిచాయి, రాత్రులు గడిచాయి, మళ్ళీ పగళ్ళు వచ్చాయి, స్పర్శపరిపూర్ణ మయింది. సఫల మయింది.

అతడు అనుకున్నాడు: ''ఆమెను నే నేమీ అడగను. పేరుకూడా అడగను. పేరు మళ్ళీ ఆమెను వేరుపరుస్తుంది''

ఆమె తనలో అనుకుంది: ''అతడే ఓసిరిస్. నాకింక ఏమీ తెలియనక్కరలేదు.''

చెట్లమీద కొత్తమొగ్గలు ఎదిగాయి. గులాబీలకాలం గడిచిపోయింది. గడ్డిపువ్వులు పూసి మాడిపోయాయి. చిక్కడు పొలాల వాసన గాలిలో కొత్తగా వ్యాపించింది. అన్నీమారితే, తన రేకులు మార్చుకుని విశ్వపద్మం ఇంకో పక్కకి తిరిగి ఇంకోలా అగుపడుతోంది. వసంతం ఫలించింది. స్పర్శ సఫలమయింది, వారిద్దరూ ఒకరిలో ఒకరు సాఫల్యం పొందారు. ఇంక ఎడబాటు వాతావరణంలో నిండింది. ఒకనాడు చెట్లకింద అతడు ఆమెను కలుసుకున్నాడు. ఉదయ సూర్యుడు ఎండగా ఉన్నాడు. పైన చెట్లు కమ్మగా వాసన

వేస్తున్నాయి. కొండలమీద ఆఖరి గన్నేర్లు అక్కడక్కడ పూస్తున్నాయి. ఆమె మెల్లగా అతనిదగ్గరకు వచ్చింది. ఆమె తాపీగా రావడంలో, తననించి మృదువుగా తొలిగి నిలవడంలో మార్పు అతడు గ్రహించాడు.

"నువ్వు గర్భవతివా ?" అని అడిగాడు.

"ఏం ?" అంది ఆమె.

"పూత తరవాత పిందెలు దోడిగిన పెద్దమామిడిలా ఉన్నావు నువ్వు. నీలో ఏదో తొలిగి నిలుస్తోంది."

"అవును" అంది ఆమె. "నేను గర్భవతిని నీవల్ల. మంచిదేనా ?"

"మంచిదే" అన్నాడు అతడు. "మంచిది ఎల్లాకాకుండా ఉంటుంది? ఇంక కోయిల తనచెట్టుతొర్రలో రాత్రులు కూత వెయ్యదు. కాని నువ్వు ఎక్కడ పురుడు పోసుకుంటావు? నాకు ప్రాణం తప్ప ఇంక వేరే ఆశ్రయం ఏమీలేదు."

"ఇక్కడే ఉందాం" అంది ఆమె.

"కాని ఆమె మీ అమ్మ ?" అన్నాడు అతడు.

ఆమె కనుబొమలమీద మేఘం కమ్మింది. ఆమె జవాబు చెప్పలేదు. "ఆమెకు తెలిస్తే ?" అన్నాడు.

ఆమె ఆలోచించుకుంది. 'ఆమె నిన్ను బాధపెడుతుందా?'

"అబ్బే! నన్నేమీ చెయ్యలేదు. నాకున్నదేదో నాదే. నేను నా ఓసిరిస్‌తో నిండిపోతాను..."

"కాని నువ్వు చూశావా? ఆమె బానిసలు ?"

ఆమె అతనివేపు చూసింది. ఆమె నిండుచూలురొయొక్క ప్రశాంతి అదుర్దావల్ల కొంచెం కరిగిపోయింది.

"నువ్వేమీ బాధపడకు, అన్నాడు" అతడు. "నేనోసారి ఓచావు చచ్చాను."

అతనికి ఇంక వెళ్ళిపోవలసిన సమయం సమీపించిందని తెలిసింది. తన అదృష్టాన్ని చంకని పెట్టుకొని తనదారినే ఒంటరిగా పోవాలి. అయినా ఒంటరిగానూ కాదు. తన స్పర్శ ఆమెలో మూర్తీభవించినట్టుగానే, ఆమె స్పర్శ అతనితోకూడా ఉంటుంది. అదృశ్య సూర్యులు అతన్ని వెంబడిస్తారు. అయినా అతడు వెళ్లిపోవాలి. ఈ చిన్న సముద్రప్రుపాయలో చిన్నజీవితం యొక్క ఈర్ష్య, స్వత్వం, వాటి బలాన్ని కూర్చుకుంటున్నాయి. ఆధాన సూర్యులయొక్క తీవ్రబలం తగ్గిపోతోంది. స్వత్వంపేరుతో ఆ వితంతువూ, ఆమె బానిసలూ, అతడు తిన్న తిండికీ, అతడు ఏర్పరచిన సజీవమయిన బాంధవ్యానికీ, అతడు అనుభవించిన సుఖానికీ, తగిన ప్రతి క్రియ చెయ్యాలని చూస్తారు. కాని అతడు అనుకున్నాడు: "కాని ఇంకోసారి నేను చాకివు లొంగిపో కూడదు. నాలో స్పర్శని వాళ్లు అపవిత్రం చెయ్యడానికి వీలులేదు. నాజాగ్రతలో నే నుండాలి."

వాళ్లని పరీక్షగా చూశాడు. వాళ్లు కుట్రచేస్తున్నట్టు తెలుసుకున్నాడు. అందువల్ల తన గుహావదలి సముద్ర తీరాన్ని ఇసుకలో కొండలమధ్య ఓ చిన్న రహస్య ప్రదేశానికి కదలిపోయాడు. ఆమెతో అన్నాడు: "నే వింక వెళ్ళిపోవాలి. బానిసలవల్ల నాకు అపాయం రావచ్చు. కాని నేను మగవాణ్ణి. లోకం చాలా విశాలమయింది. మన ఇద్దరిమధ్యా స్పర్శ దివ్యంగా ఫలించింది. శాంతిగా ఉండు

మళ్ళీ కోయిల చెట్టుతో‌ర్రలోంచి కూసేనాటికి నేనూ వసంతం లాగే తిరిగి వస్తాను.''

ఆమె అంది : ''నువ్వు వెళ్ళవద్దు. నాతో ఈ సగం ఆస్తి లోనూ ఉండిపో. ఈ పైన్ చెట్లమధ్య గుడిపక్కని మన ఇద్దరికీ ఓ ఇల్లు కట్టిస్తాను. మనం విడిగా కాపురం ఉండవచ్చు.''

అయినా అతడు వెళ్లిపోతాడని ఆమెకు తెలుసును. తన చల్లని ఏకాంతమే తనకు మంచిదనీ, ఆదుర్దానించి తను దూరంగా ఉండాలనీ కూడా ఆమెకు తెలుసును.

''నేను ఉండిపోయినట్టయితే, వాళ్లు నన్ను రోమన్లకీ, వాళ్ళ న్యాయానికీ వప్పగిస్తారు. కాని నే నింక మోసపో దలుచుకోలేదు. అంచేత నేను వెళ్లిపోయిన తరవాత, ఎదిగే ఆ శిశువుతో ప్రశాంతిగా ఉండు. మన ఇద్దరిమధ్యా దూరంగాఉన్నా దగ్గరగా ఉన్నా అంతామంచే. సూర్యులు వాళ్ళ ఋతువుల్లోమళ్ళీ వస్తారు. అల్లాగే నేనూ వస్తాను.''

''అప్పుడే వెళ్ళిపోకు!'' అంది ఆమె. ''భూమినాలుకరి ముఖందగ్గర ఓ బానిసని కాపలాపెట్టాను. అపాయం దగ్గరకు వచ్చేదాకా వెళ్లిపోకు.''

కాని ఒకరాత్రి అతడు తన గుహలో ప్రశాంతిగా పడుకుని ఉండగా, మెల్లని తెడ్ల చప్పుడు విన్నాడు. ఓ నావ రాతిగట్టుమీద తూలిన చప్పుడు కూడా వినబడింది. అతడు జాగ్రత్తగా చెవులు నిక్కబెట్టుకుని విన్నాడు. రోమక ఉద్యోగి గొంతు వినబడింది, ''ఏదీ, ఆ మేకల గుహకు దారి చూపించు, ఫీసిపస్, అపరాధిమీద, నిద్రపోతో ఉండగా

వల విసురుతాడు. న్యాయాధికారుల ముందు అతన్ని పేడదాం. ఐసిస్ సతికిమాత్రం ఇదేమీ తెలియకూడదు..''

చచ్చిపోయిన మనిషి జాలిసల వంటినుంచి వచ్చే మాంసపు వాసన గుర్తించాడు. తరువాత రోమన్ ఉద్యోగి మీాది అత్తరువాసన. వాళ్ళంతా పైకి నడచిపోయారు. సముద్రపు అంచుకి అతడు నెమ్మదిగా పాకి వెళ్ళాడు. సముద్రం నిశ్చలంగా ఉంది. నావలో జాలిస తెడ్లు చేత్తో పట్టుకుని కూర్చున్నాడు. ఆ రాతిమరుగుని చీకట్లోదాగి స్పష్టంగా వినబడేటట్టు అన్నాడు: ''ఆనాడు ఆడ జాలిసను ఐసిస్ సతి ఎదురుగా కౌగిలించుకున్నది నువ్వేనా? చెప్పు. నువ్వే కాదూ?''

జాలిస భయపడి నిలబడ్డాడు. అతని భయంతో నావ గట్టుకి కల్లోలంగా కొట్టుకుంది. ఎటో తెలియక ఆ జాలిస గట్టుమీాదికి దూకి ఆకొండలలోకి పారిపోయాడు. చచ్చిపోయినమనిషి తొందరగా నావలోకి దూకి గట్టునించి తోశాడు. తెడ్లుచేత్తో పట్టుకున్నాడు. జాలిసలచేతులయొక్క అసహ్యకరమయిన వెచ్చదనం ఆ తెడ్లనింకా అంటిపెట్టుకుని ఉంది. నెమ్మదిగా నావ నతడు సముద్రప్రవాహంలోకి నెట్టాడు. తీరపువారే నీటివాలులోకి నావ ప్రశాంతంగా అతన్ని మోసుకుపోయింది. నక్షత్రకాంతిముందు భూభాగం కూడా చీకటిగా ఉంది. భూమి నాలుకమీాద ఎక్కడా వెలుగు మినుకు మనడం లేదు. ఆమె ఇంక రాత్రులు గుడిదగ్గరకు రావడంలేదు. ప్రవాహంతోపాటు చచ్చిపోయినమనిషి నావతో తనలో తను నవ్వుకున్నాడు: ''నేను నాజీవితపు

విత్తనం, నాచచ్చిబతికిన విత్తనం నాటివేశాను. ఈనాటి ఉత్తమోత్తమస్త్రీమీద నాముద్రపడింది. గులాబిఅత్తరులా ఆమె సుగంధం నామాంసంలో అంతా నిండిపోయింది. నాజీవితకేంద్రంలో ఆమె నాకు ఎంతో ఆప్తవస్తువు. కాని బంగారు నాగసర్పం తనపడగలు ముడుచుకుని నాచెట్టు మొదట్లో ఇంక నిద్రించడానికి చుట్టచుట్టుకుంటోంది. ఈనావ మోసుకుపోయినచోటికి నేను పోతాను.''

రేపు మళ్ళీ ఇంకోరోజు.

